# కాల్గేట్‌తో రోజంతా చెడ్డ శ్వాసను నిరోధించండి దంతక్షయాన్ని నివారించండి!

ఎందుచేతనంటే కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో ఒక్కసారి తోమినంతనే 85% వరకు నోటి దుర్వాసన మరియు దంతక్షయ కారకులైన సూక్ష్మ క్రిములు తొలగిపోవును.

కాల్గేట్ 10 మందిలో 7 గురి చెడ్డ శ్వాసను వెంటనే అరికట్టినదని మరియు కాల్గేట్ పద్ధతితో భోజనానంతరం పళ్లు తోము కొనుట వల్ల దంత శాస్త్రి చరిత్రలో మునుపు ఎప్పుడూ ఎరుగనంత ఎక్కువ మందికి దంతక్షయమును బాగా అరికట్టిందని శాస్త్రి పరీక్షలు నిరూపించాయి!
కోల్గేట్‌లో మాత్రమే యీ ఋజువు ఉన్నది.

ఎంతో చక్కని పిప్పరమెంటు రుచి కూడా—
కాల్గేట్‌తో క్రమముగా పళ్లు తోముకోవటం
పిల్లలకు చాలా ఇష్టం.

మీకు పౌడరు కావాలంటే,
ఈ ప్రయోజనాలన్నింటినీ
కాల్గేట్ టూత్ పౌడరు
వల్ల పొందండి...
ఒక డబ్బా నెలల
తరబడి వస్తుంది!







ఇప్పుడు!
సూపర్ సైజ్
కొని ...డబ్బు పొదుపు
చేయండి!

శుభ్రతకు, తాజా శ్వాసకు, ధవళ దంతాల కోసం...
ప్రపంచంలోని ఏ ఒక్క ఇతర టూత్‌పేస్టు కన్నా కాల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు.

DC.G.38 TEL

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు





ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.



విడి ప్రతి
75 పైసలు

సంవత్సర చందా
రూ. 9/-



నిర్మాత
వి.కె.ప్రసాద్

సంగీతం:
యం.యస్.విశ్వనాథం

కథ-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం:
కె.బాలచందర్. B.Sc.

ప్రసాద్ ఆర్ట్స్ వారి



# సత్తెకాలపు సత్తెయ్య

ఆంధ్రా, సీడెడ్, నైజాం: పూర్ణా
మైసూరు: దేవి ఫిలింస్ (ప్రై) లిమిటెడ్.

# సవ్యమైన పెంపకానికి రక్తి
# బోర్న్‌విటా శక్తి!

ఎదిగే వయసులోని చదువుకొనే పిల్లలకు రోజువారీ భోజనంవలన చేకూరే శక్తి చాలదు..వారికి కలిగే శక్తి అంతా చదువుల్లో ఆటలల్లో హరింపు అయిపోతుంది. పిల్లల సవ్యమైన పెంపకానికి సరియైన పోషణకు అధిక శక్తి చాలా అవసరం. తగిన శక్తిని సమకూర్చేందుకు వారికి ప్రతిరోజూ బోర్న్‌విటా ఇవ్వాలి. బోర్న్‌విటాతో పిల్లలు ఆరోగ్యంగా ఉత్సాహంగా ఉండగలరు. రుచికరమై శక్తి పోషకమైన బోర్న్‌విటా కోకో, పాలు, మాల్ట్, పంచదారల సంతులిత మిశ్రమము, మరి దీనిని తయారు చేసేవారు — క్యాడ్‌బరిస్




**శక్తి, ఉత్సాహం మరియు రుచికోసం-క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా!**

విశాలాంధ్ర అంతటా దిగ్విజయంగా
ప్రదర్శింపబడుచున్న చిత్రం!

# నేడే చూడండి!



లైఫ్‌బాయ్ మురికిలో గల క్రిములను కడిగి వేస్తుంది




ఎక్కడ

# లైఫ్‌బాయ్ వున్నదో

## అక్కడ ఆరోగ్యము వున్నది

లైఫ్‌బాయ్ మురికిలో గల క్రిములను కడిగి వేస్తుంది

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

# ఇప్పుడు!
# కేవలం 12 రోజులలోనే
# ఎక్కువ తెల్లటి పళ్లు!

పెప్సొడెంట్ లోని
ప్రభావకరమైన
క్రొత్త సూత్రము కేవలం
12 రోజులలోనే పళ్లను
ఎక్కువ తెల్లగా ఆరోగ్యకరంగా చేస్తుంది




పెప్సొడెంటు ఇప్పుడు మూడు విధాల అభివృద్ధి పరచబడింది. అది క్రొత్త సూత్రము, క్రొత్త రుచి, క్రొత్త ప్యాక్ కలిగి వున్నది. సంవత్సరముల తరబడి పరిశోధన చేసి కనుగొనబడిన ఈ క్రొత్త సూత్రంలో "ఇరియమ్ ప్లస్ ఎల్‌డి 3" వుంది. ప్రభావకరమైన ఈ పదార్థములు పళ్ళ మీద వుండే పొరను తొలగించి, పళ్ళకు స్వాభావసిద్ధమైన తెల్లటి మెరుగును ఇస్తాయి. అవి శక్తివంతముగా పనిచేసి హానికరమైన క్రిములు వుండే ఆహార తునకలను తొలగించి పళ్ళు పాడవకుండా కాపాడును. శ్రేష్ఠంగా పని చేసే, సమృద్ధమయిన నురగ మీ పళ్ళ మధ్యనున్న ప్రతి సందులోకి చొచ్చుకొనిపోయి, పూర్తిగా శుభ్రపరచును. ఎక్కువగా వుండే క్రొత్త మింటు రుచి మీకు ఎంతో నచ్చుతుంది. ఇప్పుడే క్రొత్త పెప్సొడెంటు వాడండి. 12 రోజులలోనే పెప్సొడెంటు యొక్క ప్రభావము మీకు తెలుస్తుంది.

| క్రొత్త సూత్రము | క్రొత్త రుచి | క్రొత్త ప్యాక్ |
| --- | --- | --- |

హిందూస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి విశిష్టమైన
[illegible]





# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

"నల్ల కోడిపెట్ట" అన్న కథలో వచ్చే సుమంగ్ అనే కోయయువకుడి పాత్ర "నీటి విలువ" [డిసెంబరు 1968 సంచిక]లో పాఠకులు చదివేవుంటారు. ఆ కథ చదవకపోయినా ఈ కథ చదువుకోవచ్చు.

"సహజీవనం" అన్నది చాలా పాత జానపద కథే. కాని అందులో ఈనాటికి కూడా పనికివచ్చే నీతి ఉన్నది. బలవంతులకూ, బలహీనులకూ మధ్య సహజీవనం ఏర్పాటైతే బలహీనులు నష్టపోతారు. అదే ఆ నీతి.

సంపుటి 44 మే '69 సంచిక 5




# ఉపాయశాలి

ఒక ఊళ్ళో ఒక ధనికుడైన భూస్వామి ఉండేవాడు. ఆయనకు ఇద్దరు కొడుకులు. పెద్దవాడు బొత్తిగా అమాయకుడు. రెండో వాడు చాలా చురుకు. అన్నదమ్ము లిద్దరూ ఎంతో అన్యోన్యంగానే ఉండేవారు. కాని వాళ్ళు పెద్దవాళ్ళయి, పెళ్ళాలు కాపరానికి వచ్చి, ఎవరి సంసారాలు వారు చూసుకునే టప్పుడు అమాయకుడైన పెద్దవాడికి అన్యాయం జరగవచ్చునని తండ్రికి తోచింది. ఇలా జరగకుండా ఆయన ఒక పనిచెయ్య నిశ్చయించి గ్రామాధికారిని పిలిపించాడు.

గ్రామాధికారి వచ్చి, తనను భూస్వామి పిలిపించిన కారణం అడిగాడు.

"నా అనంతరం నా ఆస్తి అంతా పెద్ద వాడికి రాసి యిద్దామనుకుంటున్నాను. చిన్నవాడికి చిల్లిగవ్వ ఇవ్వను," అన్నాడు భూస్వామి.

"పాపం, చిన్నవాడికి అంత అన్యాయం చేస్తారా?" అన్నాడు గ్రామాధికారి.

"పెద్దవాడికి ఏమీ తెలియదు. చిన్న వాడు చురుకైనవాడు. ఇప్పుడిద్దరూ అన్యోన్యంగానే ఉంటున్నారనుకోండి. పెళ్ళాలు కాపరానికి వచ్చాక ఈ అన్యోన్యం ఉండదు. అప్పుడు అమాయకుడైన పెద్ద వాడు చాలా నష్టపోతాడు. వాళ్ళిద్దరికీ తేడా మీరు స్వయంగా చూద్దురుగాని," అని భూస్వామి తన పెద్ద కొడుకును పిలి పించాడు. పెద్దవాడు వచ్చి, "ఎందుకు పిలి చారుట?" అని అడిగాడు.

"చూడు, నాయనా, రెండడుగులు చదరమూ, రెండడుగులు లోతూగల గుంట నుంచి ఎంత మట్టి తీయవచ్చు?" అని తండ్రి వాణ్ణి అడిగాడు.

"పెద్ద బుట్టెడు మట్టి తీయవచ్చు, నాన్నా," అన్నాడు పెద్దవాడు.

జె. అచ్యుతానందం



"సరే, నువ్వు వెళ్ళి తమ్ముణ్ణి పంపు," అన్నాడు తండ్రి. చిన్నవాడు వచ్చాడు. తండ్రి వాణ్ణి కూడా అదే ప్రశ్న వేశాడు.

"రెండడుగులు చదరమూ, రెండడుగులు లోతూగల గుంట నుంచి మట్టి ఏం వస్తుంది, నాన్నా? ఏమీ రాదు," అన్నాడు చిన్నవాడు.

తండ్రి తన చిన్న కొడుకును పంపేసి, గ్రామాధికారితో, "చూశారుగదా ఇద్దరికీ తేడా? పెద్దవాడు బొత్తిగా అమాయకుడు. రెండోవాడు ఎక్కడైనా, ఎలాగయినా బతక గలడు," అన్నాడు.

తరవాత కొంతకాలానికి భూస్వామి చని పోయాడు. గ్రామాధికారి వచ్చి అన్న దమ్ములతో, "మీ తండ్రి ఆస్తంతా పెద్ద వాడికి చెందేటట్టుగా పత్రం రాసి నా చేతి కిచ్చాడు. ఇదుగో ఆ పత్రం," అన్నాడు.

తన తండ్రి తనకు అంత అన్యాయం చేస్తాడని చిన్నవాడు ఊహించలేకపోయాడు. ఆయనకు తనపైన ఎలాటి ద్వేషమూ లేదని వాడికి తెలుసు. కాని పత్రంలో స్పష్టంగా ఆస్తి యావత్తూ తన అన్నకే రాసి ఉంది. దీని కేదో కారణం ఉండి ఉంటుందనీ, అది నిలకడ మీదగాని తెలియదనీ అతను అనుకున్నాడు.

తండ్రి చేసిన ఏర్పాటు అన్నకు కూడా అన్యాయంగానే తోచింది. అతను తమ్ముడితో,



"ఆస్తంతా నాకే చెందటం బాగా లేదు. అందులో సగం ఇస్తాను తీసుకో. ఇద్దరమూ సమంగా పంచుకుందాం," అన్నాడు.

కాని అందుకు తమ్ముడు ఒప్పుకోక, "అలా వద్దు. ఏదో ఉద్దేశంతో నాన్న ఇలా చేసి ఉండాలి. ఆయన చేసిపోయిన ఈ ఏర్పాటును మనం మార్చటం భావ్యంగావుండదు," అన్నాడు.

ఆ రోజే రెండోవాడు తమ గ్రామం విడిచి, మరెక్కడైనా బతుకుతెరువు చూసుకునేటందుకు బయలుదేరాడు. కొంతకాలం ప్రయాణం చేసి అతను ఒక నగరం చేరాడు. ఆ నగరంలో కొత్తగా కట్టిన భవనం ఒకటి



ఉన్నది. కాని అందులో ఎవరూ ఉంటున్న జాడ లేదు. చిన్నవాడు దాన్ని గురించి ఊళ్ళోవాళ్ళను అడిగాడు.

"పది లక్షలు పోసి రాజుగారు ఆ భవనం కట్టించారు. ఇటీవలనే అది పూర్తి అయింది. అయితే ఇంతలోనే ఆ భవనంలోకి ఏదో దయ్యం ప్రవేశించింది. దాన్ని చాలామంది చూశారు. రాత్రివేళ ఎవరన్నా లోపలికి అడుగు పెడితే అది వాళ్ళను అటకాయించి, భయపెడుతుంది. దాంతో వాళ్ళు బెదిరి పారిపోతారు," అని ఊళ్ళోవాళ్ళు చిన్నవాడికి చెప్పారు.

"అందుకని రాజుగారు ఇంత గొప్ప భవనాన్ని పాడుపెట్టేశారా?" అన్నాడు చిన్నవాడు.

"దయ్యాన్ని వదలగొట్టాలనీ, మారణహోమం చెయ్యాలనీ రాజుగారు చాలా ప్రయత్నాలు చేశారు. అవేవీ ఫలించలేదు. ఎవరన్నా ఆ దయ్యాన్ని పారదోలితే లక్ష రూపాయలిస్తామని చాటింపు కూడా వేశారు. కాని దయ్యాలతో ఎవరు చెలగాటాలాడతారు?" అని ఊళ్ళోవాళ్ళు చెప్పారు.

చిన్నవాడు రాజుగారి వద్దకు వెళ్ళి, "మహారాజా, కొత్త భవంతిలో ఉన్న దయ్యాన్ని నన్ను ఒకసారి చూడనివ్వండి.

సాధ్యమైతే దాన్ని వెళ్ళగొడతాను," అన్నాడు. రాజు సరేనన్నాడు.

ఆ రాత్రి చిన్నవాడు రాజభవనం తలుపులు తెరిపించి, లోపలికి వెళ్లి, దయ్యం కోసం ఎదురు చూస్తూ కూర్చున్నాడు. ఒక రాత్రివేళ ఒక అస్పష్టమైన ఆకారం గాలిలో తేలుతూ చిన్నవాడి కెదురుగా కనిపించి, "ఎవరు నువ్వు?" అని అడిగింది.

"నే నెవరైతేనీకేం? నీకేం కావాలి? ఈ ఇంటిని పట్టుకుని ఎందుకు వేళ్ళాడుతున్నావు?" అని చిన్నవాడు అడిగాడు.

"ఒక ప్రశ్నకు సమాధానం కావాలి. సరిఅయిన సమాధానం చెబితే పోతా," అన్నది దయ్యం.

"అలాగే చెపుతాను. ఏమిటి నీ ప్రశ్న?" అన్నాడు చిన్నవాడు.

"రెండడుగుల చదరమూ, రెండడుగుల లోతూగల గుంట నుంచి ఎంత మన్ను తీయవచ్చు?" అన్నది దయ్యం.

చిన్నవాడు ఆ ప్రశ్నకు నిర్ఘాంతపోయి, "ఏమీ రాదు, నాన్నా!" అన్నాడు.

"సరిగా చెప్పావు. నేను పోతున్నా," అన్నది దయ్యం.

తెల్లవార్లూ చిన్నవాడు తన తండ్రి గురించే ఆలోచిస్తూ ఆ భవనంలో గడిపి, తెల్లవారాక రాజుగారి వద్దకు వెళ్ళి, "మహారాజా, తమ భవనం నుంచి దయ్యాన్ని పంపేశాను," అన్నాడు.

రాజు ఆశ్చర్యంగా, "పంపేశావా? ఎలా పంపేశావు?" అన్నాడు.

"అది ఆ యింట చేరిన పని పూర్తి చేశాను. అది వెళ్ళిపోయింది," అన్నాడు చిన్నవాడు.

వరసగా వారం రోజులపాటు ఆ భవనంలో మనుషులను పడుకోబెట్టి, దయ్యం లేదని రూఢి చేసుకుని, రాజుగారు చిన్నవాడికి లక్ష రూపాయల బహుమానంతోపాటు ఉద్యోగం కూడా ఇచ్చాడు.



# గ్రామాధికారి

ఒక గ్రామాధికారి వట్టి మూఢుడు.

ఒకనాడు ఒక రైతు వచ్చి, "అయ్యా, నా పొలంలో అంబోతుపడి మేస్తున్నది. దాన్ని ఎలాగయినా బయటికి తరమాలి," అన్నాడు.

"మనిషిని పంపి తరిమేయిస్తాను," అన్నాడు గ్రామాధికారి.

"ఆ మనిషి చేనంతా తొక్కేస్తాడేమో?" అన్నాడు రైతు.

"అయితే, వాణ్ణి చేను మధ్యకు మోసుకుపోవటానికి ఇద్దర్ని ఏర్పాటు చేస్తాను," అన్నాడు గ్రామాధికారి.

ఊళ్ళోవాళ్ళు కొందరు కూడబలుక్కుని గ్రామాధికారి వద్దకు వచ్చి, "అయ్యా, మన ఊరిబయట శివాలయాన్ని ఒక్క గజం వెనక్కు జరిపితే బాగుంటుంది," అన్నారు.

"మనుషులను పెట్టి తోయిద్దాం," అన్నాడు గ్రామాధికారి.

గ్రామాధికారి ఓ వందమంది మనుషులను పిలిచి, "ఆలయాన్ని ఒక్క గజం వెనక్కు తొయ్యండి," అన్నాడు. ఆ పని తన సమక్షంలోనే జరగాలి గనక ఆయన తన జరీతలపాగా తీసి గుడి వెనక ఉంచి, ముందుకు వచ్చాడు.

మనుషులు కొంతసేపు తోసినాక గ్రామాధికారి గుడి ఏమాత్రం జరిగిందో చూడటానికి వెనక్కు వెళ్ళాడు. ఆయన తలపాగా లేదు. దాన్ని ఎవరో కాజేశారు.

"ఇంక తొయ్యకండిరా! నా తలపాగా గుడి కింద పడిపోయింది. అనుకున్నదాని కన్న ఓ అడుగు హెచ్చు తోశారు!" అన్నాడు గ్రామాధికారి.





# సందేహం

ఒక ఊళ్లో ఒక బిచ్చగా డుండేవాడు. వాడికి ఒక రోజున ఒక అలోచన వచ్చింది: ఎవ రన్నా తనకు ఒక వంద రూపాయలిస్తే తన దరిద్రం తీరిపోతుంది.

ఈ అలోచన వచ్చాక వాడు ఇల్లిల్లా తిరిగి, కనిపించిన ప్రతి మనిషినీ ఒక వంద రూపాయ లివ్వమని అడిగాడు. ఆ బిచ్చ గాడు వంద రూపాయలు కావాలనటం అందరికీ హస్యాస్పదంగా కనబడింది.

ప్రతి ఒక్కరూ తనను హేళన చెయ్యటంతో బిచ్చగాడికి నిరాశ కలిగింది. ఉన్న ఊళ్లో తనకు నూరు రూపాయలు పుట్టవని తేలిపోయింది. ఇంకేదైనా వూరు పోయి అక్కడ ప్రయత్నిద్దా మనుకున్నాడు.

వాడు ప్రయాణమై పోగా పోగా దూరాన ఇళ్ళు కనిపించాయి. తనకు ఎదురుగా వచ్చే మనుషులతో వాడు, "ఆ కనిపించే వూరి పేరు ఏమిటి?" అని అడిగాడు.

"వింతపూరు," అని వాళ్ళు జవాబు చెప్పి సాగిపోయారు.

ఆ వూళ్ళో ఏమి వింత లుంటాయో చూద్దామనుకుంటూ బిచ్చగాడు ముందుకు నడిచాడు. వాడు ఊరు చేరవస్తూండగా దారి పక్క నున్న పొలంలో పని చేసుకుంటున్న ఒక రైతు వాణ్ణి కేక పెట్టి పిలిచి, "వూళ్లోకి పోతున్నావా?" అని అడిగాడు.

అవునన్నాడు బిచ్చగాడు.

"నెత్తిన బుట్ట పెట్టుకుని దారిలో ఒక అడమనిషి నీకు ఎదురు వస్తుంది. ఆ మనిషితో, 'నీ మొగుడు పొలంలో పాము కరిచి చచ్చాడట. వాడికి భోజనం తేనవసరం లేదు,' అని చెబుతావా?" అన్నాడు రైతు.

అలాగేనని బిచ్చగాడు ముందుకు సాగాడు.

రైతు చెప్పినట్టే వాడికి ఒక అడమనిషి, నెత్తిన బుట్ట పెట్టుకుని ఎదురు వచ్చింది. బిచ్చగాడు ఆమెను అపి, "నీ మొగుడు

ఐ హ్మా ద్

పొలంలో పాముకరిచి చచ్చాడట. వాడికి భోజనం అవసరం లేదట," అన్నాడు.

ఆ మాట విని ఆ మనిషి ఏమీ అనకుండా వెనక్కు తిరిగి వెళ్ళిపోయింది. ఆమె ఏడవక పోవటమూ, ఏమీ అనక పోవటమూ బిచ్చగాడికి వింతగానే తోచింది.

తరవాత వాడు ఊళ్లో ప్రవేశించాక, ఒక ఇంటి అరుగుమీద ఒక పెద్దమనిషి కనిపించాడు. అతడు నూరు రూపాయలు ఇవ్వగలవాడల్లే బిచ్చగాడికి తోచింది.

తన కొక వంద రూపాయలు కావాలని వాడు ఆ పెద్దమనిషితో అన్నాడు. ఆ పెద్దమనిషి లోపలికి వెళ్ళి వంద రూపాయలూ సంచిలో పోసి తెచ్చి బిచ్చగాడికి ఇచ్చాడు.

తాను అడిగినదే ఆలస్యంగా ఆ పెద్దమనిషి తనకు వందరూపాయ లివ్వటం కూడా బిచ్చగాడికి వింతగానే కనబడింది.

"ఏదో సందేహిస్తున్నట్టున్నావు. ఏమిటి నీ సందేహం?" అన్నాడు పెద్దమనిషి.

"ఈ వూరి పద్ధతులు నాకు అర్థం కాలేదు. ఒక ఆడమనిషి తన భర్తకు పొలానికి అన్నం పట్టుకు పోతుంటే, ఆ భర్త పొలంలో పాముకరిచి చచ్చాడన్న వార్త అందించాను. ఆమె నా మాట విని, ఏమీ అనకుండా వెనక్కు తిరిగి వెళ్ళిపోయింది. నేను మిమ్మల్ని వందరూపాయ లివ్వమని అడిగాను. నేను ఎవరో, డబ్బు ఎందుకో ఏమీ అడగకుండా నాకు డబ్బిచ్చారు. మీ వూరివాళ్ళు ఇలా ప్రవర్తించటం దేనికా అని నా సందేహం," అన్నాడు బిచ్చగాడు.

పెద్దమనిషి అంతా విని, "నీ మాటలు వింటుంటే నాకూ ఒక సందేహం కలుగుతున్నది—రేపు నా డబ్బు నాకు తిరిగి ఇవ్వమంటే నువ్వేమి జవాబు చెబుతావో నని!" అంటూ డబ్బు సంచీ లాగేసుకున్నాడు.

అవివేకమైన ప్రశ్న వేసినందుకు తనకు తగిన శాస్తి జరిగిందనుకుని బిచ్చగాడు మరో గ్రామానికి బయలుదేరాడు.






## 17

[శిథిలాలయ పూజారి తన బంటు నవరబేరుండం సాయంతో, నాగుమల్లిని అపహరించి, పారిపోయాడు. అరణ్యంలో శిఖిముఖి, పూజారికి గుర్రాన్ని అమ్మి సాయపడిన దొంగలు కనిపించగా, వాళ్ళను వెన్నంటి పోయాడు. శివాలుడూ, గండుపోతూ లోయలోకి వచ్చారు. వారికి దూరం నుంచి ఎవరో ఈలవేస్తున్న ధ్వనివినిపించింది. తరవాత—]

శివాలుడు దివిటీ వెలుగు కేసి ఓ క్షణకాలం చూసి, తన అనుచరులతో, "దివిటీని గాలిలో అల్లల్లాడిస్తున్న వాడెవడు? ఆ ఈల లోగడ ఎక్కడో విన్నట్టున్నదే," అన్నాడు ఆశ్చర్యపడుతూ.

అప్పుడు శబరుల్లో ఒకడు శివాలుడితో, "దొరా, ఆ దివిటీ కనబడుతున్న చోటున బడేచెంచు వేటకు వచ్చినప్పుడు విశ్రాంతి తీసుకునే పాక ఒకటి వున్నది. చీకటి పడే వేళ నేను అటు నుంచే వచ్చాను. ఆ సమయంలో ఎవరూ అక్కడ లేరు," అన్నాడు.

దివిటీని శివాలుడూ వాళ్ళున్న వైపుకు రమ్మన్న సూచనగా పైకీ కిందికీ ఊపుతూ, వా డెవడో మరింత బిగ్గరగా ఈల వేయసాగాడు. శివాలుడు, గండుపోతుతో మాట్లాడి, అనుచరులతో, "వా డెవడో గాని మననే పిలుస్తున్నట్టున్నది. పోదాం పదండి," అంటూ బయలుదేరాడు.



శివాలుడూ వాళ్ళు పాకను సమీపించేంతలో, దివిటీ పట్టుకున్నవాడు ఈలలు వేయటం మాని పాక లోపలికి వెళ్ళిపోయాడు. శివాలుడు పాకను సమీపించి చూసేసరికి దాని వెదురుకర్రల తలుపు మూయబడి వున్నది. లోపల వెలుగుతున్న దివిటీ కాంతి కిటికీ లోంచి బయటికి పడుతున్నది.

శివాలుడు తలుపు దగ్గిరకు పోయి దాన్ని గట్టిగా తడుతూ, "ఎవరూ లోపల? తలుపు తెరవండి!" అన్నాడు.

లోపలి నుంచి జవాబు లేదు. శివాలుడు తలుపును గట్టిగా తోశాడు. అది కిర్రుమంటూ తెరుచుకున్నది. లోపల ఒక కొయ్యబల్ల మీద శిథిలాలయ పూజారి కూర్చుని వున్నాడు. అతడు శివాలుణ్ణి చూస్తూనే వికృతంగా నవ్వి, "ఓహో, కులపెద్ద లంతా కలిసికట్టుగా వచ్చినట్టుందే! స్వాగతం అనక తప్పదు గదా? లోపలికి రండి," అన్నాడు.

పూజారి ధైర్యం, తెగువతనం చూసి శివాలుడు నిర్విణ్ణుడయిపోయాడు. సవర గండుపోతు పెద్దగా హుంకరించి కత్తి ఝళిపిస్తూ పూజారి కేసి దూకబోయాడు.

శివాలుడు, గండుపోతును భుజం పట్టుకుని ఆపి, "తొందరపడకు, పోతూ! మన చేతిలో చిక్కిన యీ దుష్టుడు మరెక్కడికీ పారిపోలేడు," అన్నాడు.

గండుపోతు ఆ మాటలతో కాస్త శాంతించాడు. కాని, అతడి కళ్ళు నిప్పులు చెరుగుతున్నవి. ఏమాత్రం వీలు దొరికినా పూజారిని కత్తితో రెండుగా నరకాలన్న ఉద్రేకంలోవున్నాడతను.

శివాలుడు, శిథిలాలయ పూజారిని సమీపించి, "మా అందరికీ ఎంతో కష్టనష్టాలు కలిగించటమే గాక; సవరపెద్ద కుమార్తెను కూడా నువ్వు అపహరించుకు పోయావు. అలాంటి నువ్వు యింత ధైర్యంగా మా



మధ్యకు రావటం నాకు ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది," అన్నాడు.

శిథిలాలయు పూజారి ఆ మాటలకు వికవికమంటూ నవ్వి, "నువ్వు గండుపోతు కన్న ఎన్నో రెట్లు వివేకవంతుడివి, నా శక్తిసామర్థ్యాలు ఎలాంటివో యిప్పటికి నీ కర్థమైనవనుకుంటాను," అన్నాడు.

పూజారి నవ్వు, అతడి మాటల వెనక వున్న అవహేళనా చూసి శివాలుడు మండిపడి, ఒక్క అంగలో అతణ్ణి సమీపించి మెడ గట్టిగా పట్టుకుని, "నీచుడా, అంత ధీమాగా మాట్లాడకు. నాగుమల్లిని ఎక్కడ దాచావు? వెంటనే చెప్పు," అంటూ హుంకరించాడు.




పూజారి మాట్టాడబోయి, మెడమీద శివాలుడి గుప్పెట బిగిసివుండటంతో గిలగిల్లాడుతూ కళ్ళు తేలవేసే స్థితికి వచ్చాడు. వాణ్ణి చంపే ముందు, నాగుమల్లి ఎక్కడ వున్నదీ తెలుసుకోవటం ముఖ్యంఅనుకుని శివాలుడు అతడి మెడపట్టు వదిలాడు.

పూజరి మెడను రెండుచేతులతో కాసేపు సవరించుకుని, ఒకసారి గట్టిగా కాండ్రించి, పట్టరాని కోపంతో ముక్కుపుటాలు అదురుతూండగా శివాలుడి కేసి తీవ్రంగా చూస్తూ, "శివాలూ, చివరికి నువ్వు ఆటవికుడి వన్న సత్యాన్ని బయట పెట్టుకున్నావు. నేను నీ మిత్రుడి కుమార్తెను అపహరించి కూడా, మిమ్మల్ని కావాలని యిక్కడికి ఎందుకు పిలిచానో, నీ కర్థమైనట్టు లేదు. మరొక మాట; శిథిలాలయు పూజారి పాదాలను తప్ప మరే శరీరభాగాన్నీ మానవమాత్రుడెవరూ తాకరాదు. అటువంటి పవిత్రమైన శరీరంలో మెడభాగాన్ని పట్టుకుని, నువ్వు నీ నాశనాన్నీ, నీ వంశనాశనాన్నీ కోరి తెచ్చుకున్నావు," అన్నాడు.

"ఆ వెధవ కోతలన్నీ కట్టిపెట్టి, ముందు నాగుమల్లిని ఎక్కడ దాచావో చెప్పు! అలా చెప్పకపోయావో, యీ సారి నీ తుచ్ఛ



దేహాన్ని నేను తాకను. దాన్ని మా పెంపుడు కుక్క ఎర్రగండు ఆకలయినప్పుడల్లా కొంచెంకొంచెంగా తినేస్తుంది," అన్నాడు శివాలుడు.

ఎర్రగండు అన్నమాట వింటూనే కుక్క శివాలుణ్ణి సమీపించి, అతడి పక్కగా నిలబడి చిన్నగా మొరుగుతూ, శిథిలాలయ పూజారి కేసి దూకేందుకు కాళ్ళు చాచబోయింది. శివాలుడు దాని తల నిమురుతూ, "ఈ నీచుడి దేహం విషంతో సమానమన్న భయం నా కుంది. తొందరపడి తిని ప్రాణాపాయం తెచ్చుకోవటం ఎందుకు, కొంచెం ఆగు," అన్నాడు.



"శివాలూ, ఈ అవమానాన్ని నేను సహించను. నీ మేలు కోరి ఒక మాట చెపుదామని వచ్చాను. కాని, నీ ధోరణి నాకు కోపం తెప్పిస్తున్నది. నేను వెళుతు తున్నాను," అంటూ శిథిలాలయపూజారి బల్ల మీది నుంచి లేచాడు.

అప్పటి వరకూ తనలో పొంగే కోపాన్ని అణుచుకుని, ఓ పక్కగా నిలబడి అంతా వింటున్న సపరగండుపోతు, పూజారి లేచి నిలబడగానే, యిక కోపాన్ని పట్టలేక ఎగిరి అతడి మీద పడి, రెండుచేతుల్తో పైకెత్తి నేలకు విసిరి కొట్టబోయాడు. శివాలుడు చప్పున, గండుపోతు ముందుకుపోయి, అతడి చేతుల్లో విలవిల తన్నుకుంటున్న పూజారిని నడుం పట్టుకుని కిందకు దింపి, "పోతూ, కొంచెం ఆగు. ముందు నాగుమల్లి ఎక్కడ వున్నదో తెలుసుకోనివ్వు. తరవాత వీణ్ణి నీ యిష్టం వచ్చినట్టు చిత్రవధ చేద్దువుగాని," అన్నాడు.

శిథిలాలయ పూజారి భయంతో వణికిపోతూ, "మీ రింత బుద్ధిహీనులని తెలిస్తే, నే నిక్కడికి వచ్చేవాణ్ణే కాదు. నా దారిన నేను హిమాలయాలకు వెళ్ళిపోయేవాణ్ణి. సరే, నాగుమల్లి ఎలాంటి ప్రమాదంలో చిక్కుకుని వున్నదో మీకు అంతుబట్టినట్టు



లేదు. మీ ఇద్దరు మూర్ఖ ఆటవికుల్ని చంపేందుకు నేను నా మహా మంత్రశక్తిని వృథాపరచ దలచలేదు. ఇక్కడ నేను మరణించటమే జరిగితే, అ మరుక్షణంలో నాగుమల్లి అక్కడ చిత్రవధ చేయబడు. తుంది. అందుకు అవసరం అయిన ఏర్పాట్లన్నీ చేసే నేను మీ మధ్యకు వచ్చాను. జాగ్రత్త!" అన్నాడు.

పూజారి యిలా అనేసరికి శివాలుడికీ, గండుపోతుకూ వాడి ఎత్తుగడ అర్థమై పోయింది. ఇక్కడ పూజారికి ఎలాంటి హాని జరిగినా, అతడి భృత్యులు నాగుమల్లిని హత్య చేస్తారు...

"పూజారీ, యిప్పటికి నీ కుతంత్రం ఏమిటో నాకు పూర్తిగా అర్థమైంది. సరే, నీకు ఎలాంటి ప్రాణాపాయం రాదు. నాగుమల్లిని ఎక్కడ మా స్వాధీనం చేస్తావు?" అని అడిగాడు శివాలుడు.

"నాగుమల్లిని పట్టే మీకు తిరిగి ఒప్ప చెప్పదలిస్తే, అసలు యిక్కడికి నేను రావటం ఎందుకు? నేను పిచ్చివాణ్ణను కున్నారా? విక్రమకేసరి నీకు తెచ్చి యిచ్చిన, తాళపత్రాలు నా స్వాధీనం చేస్తే, నాగుమల్లి సజీవంగా మిమ్మల్ని చేరుతుంది. లేకపోతే, రేపు సూర్యోదయంవేళ, తలలేని ఆమె మొండెం, కొండ మలుపున వున్న





రావిచెట్టుకు వేలాడుతూ వుంటుంది," అన్నాడు శిథిలాలయ పూజారి.

"సరే, అలాగే ఆ తాళపత్రాలు పల్లె నుంచి తెప్పించి నీకిస్తాను. కాని, నాగుమల్లిని నువ్వు వదులుతావన్న నమ్మకం ఏమిటి?" అని అడిగాడు శివాలుడు.

"నేను ఆటవికుణ్ణి కాను, దేవీభక్తుణ్ణి! దేవీభక్తుడు మాట తప్పడు. ఆ తాళపత్రాలున్న సంచీని, తెల్లవారే లోపల ఆ రావిచెట్టుకు వేలాడ కట్టండి. వాటిని నా శిష్యుడు తీసుకోగానే, నాగుమల్లి అక్కడే మిమ్మల్ని కలుసుకుంటుంది," అన్నాడు శిథిలాలయ పూజారి.

"మాట తప్పవు గదా?" అన్నాడు శివాలుడు.

"ఆ మూర్ఖ ప్రశ్నకు యింతకు ముందే జవాబు చెప్పాను. మరో అరగంటలో నేను నా స్థానానికి చేరకపోతే, నాగుమల్లి మొండెం రావిచెట్టును చేరుతుంది. వెళతాను ... సూర్యోదయం లోపల— గుర్తుందిగదా?" అంటూ శిథిలాలయ పూజారి పాకలోంచి బయటికి నడిచి, చీకట్లో కలిసిపోయాడు.

పూజారి పోగానే శివాలుడు, గండుపోతుతో, "పోతూ! మొత్తం మీద యీ పూజారి దుర్మార్గుడు మన మీద విజయం సాధించాడు. నాగుమల్లి ప్రాణం కన్న ఆ తాళపత్రాలేమీ ఎక్కువ కాదు. కాని, నా పూర్వ యజమాని పుత్రుడు ప్రాణప్రదంగా నా దగ్గిరకు పంపిన వాటిని కాపాడలేకపోయానే అన్న విచారం నాకు కలుగుతున్నది," అంటూ వాకిలి పక్కగా నిలబడి వున్న విక్రమకేసరి కేసి తిరిగి, "కేసరీ! నీ అభిప్రాయం ఏమిటి? ఇంతవరకూ నువ్వు ఒక్కగానొక్క మాట కూడా మాట్లాడలేదు," అన్నాడు.

"పెద్దలు మీరంతా సంప్రతించుకుంటున్నప్పుడు, నేను మధ్యలో కల్పించు



కోపటం బావుండదని పూరుకున్నాను. నాగుమల్లిని రక్షించేందుకు, ఆ తాళపత్రాలను పూజారి పరం చెయ్యటం ఒక్కటే మార్గంగా నాకూ తోస్తున్నది. ఒకసారి నాగుమల్లి సురక్షితంగా మనను చేరింతరవాత, తాళపత్రాలను తిరిగి సంపాయించేందుకు పూజారిని వేటాడవచ్చు," అన్నాడు విక్రమకేసరి.

"కుర్రవాడివైనా, చాలా వివేకమైన మాట చెప్పావు," అని శివాలుడు విక్రమకేసరిని మెచ్చుకుని, తన అనుచరులైన శబరులతో, వెంటనే కుంభారమిట్టపల్లెలోని తన యింటికి వెళ్ళి, తాళపత్రాలను తీసుకు రమ్మని చెప్పాడు.

ఈలోపల శిథిలాలయ పూజారికి గుర్రాన్ని అమ్మామని చెప్పిన దొంగ లిద్దరినీ అనుసరించిపోయిన శిఖిముఖి, అరణ్యంలో వాళ్ళుండే ఇంటిని చేరుకున్నాడు. దొంగ లిద్దరూ తలుపు తట్టగానే అది తెరుచుకున్నది. శిఖిముఖి ఇంటి నానుకుని వున్న చెట్ల చాటునుంచి కిటికీలో కుండా లోపలికి చూశాడు. లోపల కాగడాల వెలుగులో మరిద్దరు దొంగలు అతడి కంటబడ్డారు. నాగుమల్లి గోడ పక్కగా వున్న ఒక కొయ్య బల్ల మీద కూర్చుని వున్నది. ఆమె చేతులు రెండూ తాళ్ళతో బంధించబడి వున్నవి.




ఆ దృశ్యం చూస్తూనే శిఖిముఖి కోపంతో నిలువెల్లా కంపించి పోయాడు. ఓ క్షణం అతడు తలుపు తోసుకుని లోపలికి పోయి దొంగల్ని హతమార్చా లనుకున్నాడు. కాని, మరుక్షణంలో అతడు ఆ ప్రయత్నం తనకే కాక, నాగుమల్లికి కూడా ప్రమాదకారణం అవుతుందని గ్రహించాడు. ఇప్పుడు తను చేయువలిసింది కొండ లోయలోకి సాధ్యమైనంత త్వరగా పోయి, విక్రమకేసరినీ మరి కొందరినీ వెంటబెట్టుకుని వచ్చి, ఇంటిని చుట్టుముట్టి పూజారి అనుచరుల్ని హతమార్చి, నాగుమల్లిని విడిపించుకు పోవటం....



శిఖిముఖి యిలా ఆలోచించేంతలో అతడికి పూజారి ఎక్కడ అన్న ప్రశ్న ఎదురైంది. వాడూ, వాడి బంటు సవరభేరుండం ఎక్కడికి పోయారు? ఒకవేళ పూజారి, నాగుమల్లిని దొంగల పరం చేసి, తాను తన బంటుతో బ్రహ్మపుత్రానదీ ప్రాంతాలకు తిరిగి ప్రయాణమయ్యాడా?

ఆలోచిస్తూ కాలం వృథాపుచ్చటం మంచిది కాదనుకుంటూ శిఖిముఖి కిటికీ నుంచి యివతలికి వచ్చి, పొదల చాటున నక్కుతూ, అరణ్యం కేసి పోయే కాలిబాట మీదికి వచ్చాడు. హఠాత్తుగా అతడికి గుర్రపు గిట్టల సవ్వడి వినిపించింది. శిఖిముఖి చప్పున దారికి పక్క నున్న పొదల చాటుకు పోయాడు. అంతలో ఒక చెట్టు చాటు నుంచి సవరభేరుండం పరిగెత్తుకుంటూ వచ్చి, "ఎవరక్కడ? పొదల చాటున దాగిందెవరు? బయిటికి వచ్చెయ్యండి!" అంటూ కేక పెట్టాడు.

శిఖిముఖి ప్రమాదాన్ని గుర్తించి, అక్కణ్ణించి మరి కొంచెం దూరంగా కదిలేంతలో శిథిలాలయ పూజారి గుర్రం మీద వేగంగా అక్కడికి వస్తూ, "ఎవడూ, భేరుండమా? ఏమిటా కేకలు? శత్రువులకు మన నివాసం తెలియపరచా లనుకుంటున్నావా?" అన్నాడు కోపంగా.

"కాదు, పూజారిదేవా! పొదల్లో ఏదో అలికిడయింది!" అన్నాడు భేరుండం తడబడుతూ.

"ఆ అలికిడేదో నీ బుర్రలో అయింది. వద్దంటే మళ్ళీ అతిగా తాగుతున్నావ్. సరే, ఆ అలికిడికి కారణం ఏమిటో చూసి, త్వరగా రా," అంటూ పూజారి గుర్రాన్ని ఇంటి కేసి దౌడు తీయించాడు.

సవరభేరుండం చేతిలో వున్న ఈటెను ఝళిపిస్తూ, శిఖిముఖి దాగివున్న పొదల కేసి అడుగులో అడుగు వేసుకుంటూ బయలుదేరాడు. —(ఇంకా వుంది)





# అద్భుతచికిత్స

వినుగు చెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, కొన్ని శక్తులు ఇతరులకు మేలుచేసి తనకు కీడు తెచ్చి పెడతాయి. అందుకు నిదర్శనంగా నీకు సుమంతుడి కథ చెబుతాను, శ్రమతెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

కామాఖ్యనగరాన్ని పరిపాలించిన కామపాల మహారాజుకు ఒకప్పుడు భయంకరమైన చర్మవ్యాధి సంప్రాప్తమై, ఎలాటి చికిత్సలకూ లొంగక పోయింది. నయం కాకపోగా వ్యాధి వృద్ధి చెందుతూ వచ్చింది. ఈ వ్యాధి ఎవరివల్లా నివారణ కాదని కామపాల మహారాజుకు బెంగపట్టుకున్నది. తన రోగాన్ని నయం చేసినవారికి తన

## బేతాళ కథలు



అర్ధరాజ్య మిస్తానని ఆయన దేశదేశాలా చాటింపు వేయించాడు.

ఈ చాటింపు విని వంగదేశీయుడైన వైద్యు డొకడు సుమంతు డనేవాడు కామాఖ్యా నగరానికి వచ్చి, రాజును చూసి, ఆయన వ్యాధిని పరీక్షించి, "మహారాజా, ఈ వ్యాధిని నేను అతి శీఘ్రంగా నివారణ చెయ్యగలను," అన్నాడు.

"ఎంతకాలం చికిత్స పొందాలి? ఏమేమి ఔషధాలు తీసుకోవాలి? ఎంత ఖర్చవుతుంది? నాకు లేనిపోని ఆశలు కల్పించక నిజం చెప్పు," అన్నాడు కామపాలుడు.

"తమరు ఏ ఔషధమూ తీసుకో నవసరం లేదు. నేను చెప్పిన ప్రకారంగా వ్యాయామం చేస్తే చాలు. అదైనా ఒక్క పూటే. మర్నాటికల్లా వ్యాధి ఉండదు," అన్నాడు సుమంతుడు.

ఎన్ని మాత్రలు మింగినా, ఎన్ని కషాయాలు తాగినా లొంగని మొండి వ్యాధి ఒక్క పూట వ్యాయామం చెయ్యటంవల్ల ఎలా పోతుందో రాజుకు అర్థం కాలేదు.

"నువు చెప్పే ఈ వ్యాయామం ఎప్పుడు ప్రారంభించాలి?" అని రాజు అడిగాడు.

"రేపు ఉదయమే నేను తమ దర్శనానికి వస్తాను. అప్పుడే నేను చెప్పే విధంగా తమరు వ్యాయామం చేద్దురుగాని," అని సుమంతుడు రాజు వద్ద సెలవు పుచ్చుకుని, రాజు ఏర్పాటు చేసిన బసకు వెళ్ళిపోయాడు.

అతను ఆ రోజు ఒక వడ్రంగిని పిలిపించి, బరువైన గద ఒకటి కొయ్యతో తయారు చేయించి, దాని పిడిలో డొల్ల చేసి, అందులో ఏదో ఔషధం పెట్టి, పిడి గదకు అమర్చాడు. మర్నాడు ఉదయమే అతను ఆ గద తీసుకుని రాజుగారి వద్దకు వచ్చి, "మహారాజా, మీరు వెంటనే ఈ గదతో వ్యాయామం ప్రారంభించండి," అన్నాడు.

రాజు అలాగే చేశాడు. కొంత సేపటికి రాజు శరీరం చెమట పట్టింది. మరికొంత సేపటికి రాజు శరీరం నుంచి చెమటలు ధారలు కట్టి కారసాగాయి.

"ఇంక ఆపండి," అని సుమంతుడు రాజును తీసుకుపోయి చక్కగా స్నానం చేయించి, పడుకుని నిద్ర పొమ్మన్నాడు. రాజుకు ఒళ్ళు తెలియని నిద్ర పట్టింది. ఆయన మర్నాడు ఉదయం దాకా అలాగే నిద్రపోయాడు. లేచి చూసుకునే సరికి ఒంటిన ఎక్కడా ఒక్క మచ్చలేదు. తన శరీరం మేలిమి బంగారు చాయతో మెరిసి పోతూండటం చూసుకుని రాజు ఆనందంతో పరవశుడై పోయాడు. ఆయనకు పునర్జన్మ ఎత్తినట్టు అనిపించింది.

మర్నాడు రాజు సుమంతుణ్ణి తన దర్బారుకు పిలిపించి, "వైద్యుడా, నీ చికిత్స అమోఘం. నువు సాక్షాత్తూ ధన్వంతరివి గాని మామూలు వైద్యుడివి కావు. ఔషధ ప్రయోగం లేకుండా నాకు ఎలా చికిత్స చేశావు? మా కందరికీ తెలుసుకోవాలని ఉన్నది," అన్నాడు.

"ఔషధ ప్రయోగం చేశాను, మహా రాజా. మీరు నిన్న వ్యాయామం చెయ్యటానికి ఉపయోగించిన గద పిడిలో ఔషధం పెట్టాను. అది ఆ పిడి కుండా మీ శరీరం





లోకి చమట ద్వారా ప్రవేశించి, మీ వ్యాధిని నిర్మూలించింది. అంత గాఢమైన మందును మరే విధంగా శరీరంలో ప్రవేశ పెట్టినా ప్రాణాపాయం కలగవచ్చు. అంతకన్న సాధువులైన ఔషధాలకు తమ జబ్బు లొంగేది కాదు," అన్నాడు సుమంతుడు.

"అద్భుతం! నీ కేం కావాలో కోరుకో. నా వ్యాధి నయం చేసినవారికి అర్ధరాజ్యం ఇస్తానన్నాను. కావాలంటే ఈ క్షణాన ఇచ్చేస్తాను," అన్నాడు రాజు.

"మహారాజా, నేను ఒంటరిగాణ్ణి. వైద్యం చేసుకునేవాణ్ణి. తమరిచ్చే అర్ధరాజ్యం నేనేం చేసుకుంటాను? తమ అనుగ్రహం ఉంటే నా కంతే చాలు," అన్నాడు సుమంతుడు.

రాజు సుమంతుణ్ణి తన అంతరంగికుల్లో ఒకడుగా దగ్గిర ఉంచుకుని, తన తమ్ముణ్ణి చూసినట్టు చూసుకుంటూ, ఎంతో ప్రేమతో పాలించసాగాడు.

ఇలా కొన్నాళ్లు గడిచాక ప్రధానమంత్రి రాజుతో ఏకాంతంగా, "మహారాజా, తమకు హితవు గాని సలహా ఒకటి ఇవ్వదలిచాను," అన్నాడు.

"ఏమిటా సలహా?" అని రాజు మంత్రిని అడిగాడు.

"ఈ వైద్యుణ్ణి ఇలా నెత్తి కెక్కించుకోవటం చాలా అపాయకరం. అతన్ని తక్షణం పంపెయ్యండి," అన్నాడు మంత్రి.

"మీరు చెప్పే మాటకు అర్థం లేదు. అతను నాకు చేసిన మేలు మరవరానిది. అతని రుణం ఏం చేసినా తీరదు. ఇలాటి సలహాను మరెన్నడూ ఇవ్వకండి," అని రాజు కటువుగా మంత్రిని మందలించాడు.

మరి కొంత కాలం గడిచాక మంత్రి రాజుకు మళ్ళీ అదే సలహా ఇచ్చాడు.

"మీరు సుమంతుడి పైన ఎందుకిలా పగ బట్టారు? అతను మీ కేం అపకారం చేశాడు?" అని రాజు మంత్రిని అడిగాడు.



"అతను నా కేమీ అపకారం చెయ్య లేదు. నేను ఆలోచిస్తున్నది మీకు జరిగే అపకారం గురించి. మీరు మామూలు మనిషి కాదు. ఒక రాజ్యం మీమీద ఆధార పడి ఉన్నది. ఔషధం ఎలా ఇచ్చినదీ తెలియ రాకుండా భయంకరమైన వ్యాధిని నయం చెయ్యగలవాడు, అంత అవలీల గానూ విషప్రయోగం చెయ్యగలడు. అతను ఈ నాడు మంచివాడే కావచ్చు. రేపు అతనిలో రాజ్యకాంక్ష పుట్టుకు రావచ్చు. లేదా మన శత్రువులు అతన్ని ప్రలోభ పెట్టి, అతన్ని తమ చారుడుగా ఉపయోగించుకుని మీ ప్రాణానికి ప్రమాదం తీసుకు రావచ్చు. అతనివల్ల ఎటువంటి ప్రమాదం రావటానికి అవకాశం ఉందో మీరు ఆలోచించుకోవచ్చు. ఇలా హెచ్చరించటం మంత్రి నైన నా విధి అనుకుని తమతో ఈ మాట అన్నాను. ఇందులో నా స్వార్థం అంటూ ఏమీ లేదు," అన్నాడు మంత్రి.



మంత్రి మాటలలో రాజుకు వెంటనే విశ్వాసం కుదరలేదు, కాని అతను అన్న దానిలో నిజం ఉన్నట్టు స్పష్టమయింది. నిజానికి, సుమంతుడు తన ప్రాణం తీయ దలుచుకుంటే, అతన్ని అడ్డటం ఎవరి తరమూ కాదు. అతను అర్ధరాజ్యం ఇస్తా నంటే వద్దనేశాడు. పూర్తి రాజ్యం కాజేసే శక్తి అతనికి ఉన్నది. ఈ వైద్యుడు తనను నమ్మించి ప్రాణం తీయడని ఏమిటి?

అనుమానం ఒకసారి రాజు మెదడులో ప్రవేశించాక సుమంతుడి ప్రవర్తన అంతా అనుమానంగానే కనబడింది. అతన్ని ఇంత కాలం చేరదీసి, ఇప్పుడు వెళ్ళ గొట్టేస్తే అందుకు బలమైన కారణం చెప్పాలి. నిజంగా బలమైన కారణం చూపితే సుమంతుణ్ణి తాను క్రూరంగా శిక్షించటం మేలు గాని పంపించెయ్యటం నిరర్థకం. అతన్ని శత్రువుగా చేసుకుని బతికి ఉండ నివ్వటం కూడా అపాయకరమే.



అందుచేత రాజు సుమంతుణ్ణి చంపెయ్య నిశ్చయించాడు. ఈ మాట మంత్రితో అంటే, "అతను చాలా శక్తిమంతుడు. మీరు అతన్ని ఏమి చెయ్య దలచుకున్నా అతనికి ముందు తెలియనివ్వకుండా చెయ్యండి. అతన్ని చంపటం అన్యాయమే అయినా మీ క్షేమమూ, రాజ్యక్షేమమూ ఆలోచించి అలాటి అన్యాయం చెయ్యక తప్పదు," అన్నాడు మంత్రి.

ఆరోజు అర్ధరాత్రివేళ రాజు తన భటులను సుమంతుడి ఇంటికి పంపి, అతన్ని ఉన్నపాళంగా తన రహస్యమందిరానికి రప్పించాడు.

"నిద్రపోతున్నవాణ్ణి నిర్బంధంగా రప్పించారు. కారణమేమిటి?" అని సుమంతుడు రాజును అడిగాడు.

"నిన్ను వెంటనే చంపెయ్య నిశ్చయించాను. నీ తల తీయటానికి తలారి సిద్ధంగా ఉన్నాడు," అన్నాడు రాజు.

"నేను చేసిన ద్రోహం? ఈ దండనకు కారణం?" అని సుమంతుడు అడిగాడు.

"నువు చెయ్యబోయే ద్రోహానికిది శిక్ష. పరమానవుడికి తెలియకుండా నా శరీరంలోకి ఔషధాన్ని పంపినవాడివి, అలాగే విషాన్ని పంపలేవా? నీవల్ల నాకు ఏ క్షణాన అయినా ప్రాణాపాయం ఉన్నది. అందుచేత నీ తల తీసేస్తేగాని నేను నిశ్చింతగా ఉండలేను," అన్నాడు రాజు.

"తమకు నేను బతికి ఉండటం బాధాకరమైతే సంతోషంగా నా ప్రాణాలు బలి పెడతాను. ఈ అవకాశాన్ని వినియోగించి మీకు ఒక గొప్ప మంత్రం యొక్క ప్రభావాన్ని చూపుతాను. ఇంటి వద్ద నా దగ్గిర ఒక ప్రాచీన తాళపత్ర గ్రంథం ఉన్నది. అందులో ఒక మంత్రం ఉన్నది. నా తల తీసేశాక తమరు ఆ మంత్రం చదివి ప్రశ్నలు వేసినట్టయితే నా తల వాటికి సమాధానా లిస్తుంది," అన్నాడు సుమంతుడు.

రాజుకు ఆసక్తి కలిగింది. సుమంతుడి శక్తులలో ఆయనకు అపారమైన నమ్మకం ఉన్నది. "ఏదీ ఆ తాళపత్ర గ్రంథం?" అన్నాడాయన.

"తమరు భటుల వెంట నన్ను నా బసకు పంపిస్తేట్టయితే ఆ గ్రంథాన్ని వెతికి తెస్తాను," అన్నాడు సుమంతుడు.

రాజు సమ్మతించాడు. భటులను బయట ఉండమని సుమంతుడు లోపలికి వెళ్ళి, ఒక తాళపత్ర గ్రంథం తీసి దాని పత్రాలకు విషం పూశాడు. దాన్ని తీసుకుని అతను రాజు వద్దకు తిరిగి వచ్చి, "మహా రాజా, నేను చెప్పిన పుస్తకం వెతకటానికి కొంచెం ఆలస్య మయింది మన్నించాలి. ఇదే ఆ పుస్తకం. తమరు చేతులు కడుక్కుని వచ్చి, ఒక్కొక్క పత్రమే ఎంచి ఇరవయ్యో పత్రం తీయండి. అందులో నేను చెప్పిన మంత్రం తమకు కని పిస్తుంది," అన్నాడు.

రాజు ఆత్రంగా లేచి వెళ్ళి చేతులు కడుక్కుని వచ్చి, తాళపత్రాలను లెక్కిస్తూ ఒక్కొక్కటే తిప్పసాగాడు. ఆయన పది పత్రాలు తిప్పేసరికే నరాలు లాగాయి. ఇరవయ్యో పత్రం దాకా వచ్చేలోగానే ఆయన విరుచుకు పడిపోయి ప్రాణాలు వదిలాడు.





సుమంతుడు రాజుగారి గది నుంచి బయటికి వచ్చి, రాజభటులతో, "రాజు గారు నిద్రిస్తున్నారు. రేపు ఉదయం వచ్చి వారి దర్శనం చేసుకుంటాను," అని ఇంటికి పోయి, తన వస్తువు లన్నీ మూటగట్టుకుని తెల్లవారేలోగా రాజ్యం పొలిమేర దాటి వెళ్ళిపోయాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, కామ పాలుడి దుర్మరణానికి కారకు లెవరు? నిష్కారణంగా రాజు మనస్సులో అనుమానం ప్రవేశపెట్టిన మంత్రా? లేక సుమంతు డిలా చేస్తాడని మంత్రి ముందుగానే చెప్పాడు గనక రాజుకు విషప్రయోగం చేసి చంపిన నేరం సుమంతుడికే చుట్టుకుంటుందా? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "తన ప్రాణం మీదికి వచ్చిన దాకా, రాజును చంపాలన్న దురాలోచన సుమంతుడికి లేదు. అందుచేత అతను నిర్దోషి. మంత్రి కూడా నిర్దోషి అనటానికి సందేహం లేదు. రాజ్యక్షేమం కోరి అతను కామపాలుణ్ణి హెచ్చరించాడు. అలా చేయటం అతని విధి కూడా. కాని రాజు చేజేతులా తన చావును తానే తెచ్చిపెట్టుకున్నాడు. మంత్రి మొదట సలహా ఇచ్చినప్పుడు దాన్ని చెవిన పెట్టలేదు. తరవాతనైనా మంత్రి హెచ్చరికను పాటించలేదు. ఆ హెచ్చరిక ప్రకారం సుమంతుణ్ణి పిలిచి వెంటనే తల తీయించి ఉండవలిసింది. కాని అలా చెయ్యక అతన్ని ఇంటికి వెళ్ళనిచ్చాడు. మంత్రి సలహాను అక్షరాలా పాటించి ఉంటే కామపాలుడు ఆ విధంగా దుర్మరణంపాలు అయి ఉండడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)





# నల్లకోడిపెట్ట

సిరిపురం రాజు దగ్గిర బహుమానాలు పొందిన కోయ కుర్రవాడు సుమంగ్ కోయ గూడెంలో చాలాపేరు తెచ్చుకున్నాడు. సుమంగ్ దగ్గిర అంతులేని బంగారం ఉందనీ, విజయేంద్ర మహారాజు తన కూతురినిచ్చి పెళ్లి చేస్తానంటే సుమంగ్ వద్దన్నాడనీ పుకార్లు బయలుదేరాయి. గూడెంలో ఉండే ఆడపిల్లలు అనేకమంది సుమంగ్‌ను పెళ్ళాడాలని తహతహలాడారు. కాని వాడికి వాళ్ళెవరూ నచ్చలేదు.

సుమంగ్ తల్లి, "ఎవత్తెనన్నా చూసి పెళ్ళాడరా? ఎంతకాలం ఒంటరిగా ఉంటావు?" అని రోజూ పోరుపెట్టేది.

"నాకు నచ్చినపిల్ల కానవస్తే పెళ్ళాడాలనే ఉంది. ఒక్కత్తెకూడా నాకు నచ్చలేదు. ఏంచెయ్యను?" అనేవాడు సుమంగ్.

"నీకు నచ్చేపిల్ల భూమి మీద పుట్టిందో లేదో, ముందు అది చూసుకో," అన్నది తల్లి.

తల్లి ఆమాట అనగానే సుమంగ్‌కు తన కాబోయే భార్యకోసం వెతుక్కుంటూ పోవాలన్న ఆలోచన వచ్చింది. తనకు కావలిసిన పిల్ల తనను వెతుక్కుంటూ వస్తుందా? రాదు. తానే దాన్ని వెతుక్కుంటూ పోవాలి.

"అమ్మా, పెళ్ళాన్ని వెతకబోతున్నాను," అని వాడు ఒకనాడు తల్లికి చెప్పాడు.

"ఒంటరిగా తిరిగి వచ్చావంటే నే నూరుకోను," అన్నది తల్లి.

సుమంగ్ అరణ్యాల వెంబడి బయలుదేరాడు. కోసు కోసు కొక కోయగూడెం ఉన్నది. ప్రతి గూడెంలోనూ ఎందరో పెళ్ళీడు పిల్లలున్నారు. వారిలో ఒక్కరూ సుమంగ్‌కు నచ్చలేదు.

"అందరల్లే ఉండేది నాకెందుకు? నేను చేసుకునేది ప్రత్యేకంగా ఉండాలి. ఆకాశం నుంచి ఊడిపడ్డట్టుండాలి!" అనుకున్నాడు వాడు.

సి. సుశీలా దేవి



వారం, పదిరోజులు ప్రయాణంచేసి ఒక నాటి మధ్యాన్నంవేళ వాడు మరొక గూడెం ప్రవేశించాడు. అది మరీ పేద గూడెంలా గుంది. ఊరంతా కలిసి పది పన్నెండు చుట్టు గుడిసెలు. గుడిసెల మధ్యగా గేదెలు నడిచేపాటి ఖాళీ ఉన్నది. గూడెంలో వాళ్ళంతా పొలాల్లో పనులు చేస్తున్నారు.

సుమంగ్ కిటికీలో నుంచి ఒక గుడిసె లోకి తొంగి చూశాడు. లోపల ఒక పిల్ల వంట చేస్తున్నది. ఆమెను చూడగానే వాడి గుండె ఒక్కసారి ఆగినట్టయింది. ఆడవాళ్లు అంత అందంగా ఉంటారని వాడు కలలో కూడా అనుకోలేదు. ఆమె పోతపోసిన బంగారంలాగున్నది. ఆమె అటూ ఇటూ నడుస్తుంటే సిరిపురం రాజుగారి ఆస్థానంలో నాట్యగత్తెలు వాడికి గుర్తుకొచ్చారు.

"నేను దీన్ని తప్ప ఇంకెవర్నీ పెళ్ళాడను," అనుకున్నాడు సుమంగ్.

వాడు తనలో అనుకున్నమాట వినిపించినట్టుగా ఆ పిల్ల తల ఎత్తి వాణ్ణి చూసి, చిన్నగా అరిచి, మరుక్షణం అదృశ్యమైపోయింది.

సుమంగ్ ఆశ్చర్యపడుతూ గుడిసె వాకిలి దగ్గిరికి వెళ్ళి, తడికెతలుపు తోసి, "ఎవరు లోపల?" అని అడిగాడు. తలుపు తెరవగానే ఒక నల్ల కోడిపెట్ట, "కే కె కే," అంటూ బయటికి పారిపోయింది. గుడిసె లోపల ఎవరూ లేరు. తాను భ్రమపడి ఉండవచ్చునని సుమంగ్‌కు అనుమానం వేసింది—కాని ఆ పిల్ల ముఖం ఇంకా వాడికి కళ్ళకు కట్టినట్టే ఉంది.

ఆ పిల్ల ఒకవేళ ఎక్కడన్నా దాగిందేమోనని లోపల అంతా వెతికాడు. ఆమె కనిపించిన గదిలో అప్పుడే చేసిన వంటకాలు కనిపించాయి. తాను చూసిన పిల్ల కాకపోతే వాటిని ఎవరు తయారుచేసి ఉంటారు?

దీని అంతు తేల్చుకోవాలని సుమంగ్ ఆ గుడిసెలోనే కూర్చున్నాడు. కొంతసే

పయాక ఒక ముసలిదీ, ముసలాడూ గుడిసె దగ్గిరకు వచ్చారు.

"దూరప్రయాణం చేసి వస్తున్నాను. కాస్త తిండి పెట్టండి," అన్నాడు సుమంగ్ ఆ వృద్ధ దంపతులతో.

"సరే, బాబూ. ఒక్క క్షణం ఆగు," అన్నది ముసలిది వంటఇంట్లోకి పోతూ.

"మీకు వంటచేసే అమ్మాయెవరు? మీ కూతురా? మనమరాలా?" అని సుమంగ్ ముసలివాణ్ణి అడిగాడు.

ముసలివాడు తెల్లబోయి, "అమ్మాయా? ఈ ఇంటో నేనూ, నా ఆడదీ తప్ప ఇంకెవరూ లేరు, బాబూ," అన్నాడు.

"భయపడి అబద్ధ మాడుతున్నారు. నే నా అమ్మాయిని చూశాను. ఆమెను పెళ్ళాడాలనే ఉద్దేశంతో అడుగుతున్నాను. నేను బికారివాణ్ణి కానులే," అన్నాడు సుమంగ్.

"నువు చెప్పే అమ్మాయిని మే మెప్పుడూ చూడలేదు. నిజంగా మా కేమీ తెలీదు," అన్నాడు ముసలాడు.

"అయితే, మీ రిద్దరూ పొలంలో పని చేస్తుండగా మీ కోసం వంటచేసిన వారెవరు?" అని సుమంగ్ అడిగాడు.

"అదే మాకూ ఆశ్చర్యంగా ఉంది. రోజూ మేం నిద్ర లేచేసరికి వంట చేసి






ఉంటుంది. మళ్ళీ సాయంకాలం పొలం నుంచి తిరిగి వచ్చేసరికి వంటచేసి సిద్ధంగా ఉంటుంది. ఎవరు చేస్తున్నదీ మాకు నిజంగా తెలీదు," అన్నాడు ముసలాడు.

"ఇలా ఎంత కాలంగా సాగుతున్నది?" అని సుమంగ్ అడిగాడు.

"వారం, పదిరోజుల కిందట, ఎక్కడి నుంచో ఒక నల్ల కోడిపెట్ట వచ్చింది. ఎవరి నడిగినా మాది కాదంటే, మాది కాదన్నారు. అది గుడ్లయినా పెట్టదు. ఏ వనదేవతో మాకు తోడు పంపిందనుకున్నాం. అప్పటి నుంచే మా వంట మేం వండకుండానే తయారవుతున్నది," అన్నాడు ముసలాడు.

వాళ్ళతోబాటు సుమంగ్ భోజనంచేసి, ఆ రాత్రి తనను ఆ గుడిసెలోనే పడుకో నివ్వమని ఆ ముసలి దంపతులను కోరాడు. వాళ్ళు సరే నన్నారు.

పడుకోబోయే ముందు ముసలిది నల్ల కోడిపెట్టకు మేత వేసి, దాన్ని పళ్ళెక కింద ఉంచింది.

ఆ రాత్రి సుమంగ్‌కు కొంచెం కూడా నిద్రపట్టలేదు. అర్ధరాత్రి దాటినాక చిన్న చప్పుడు వినిపించింది. వాడు తల ఎత్తి చూస్తే, నల్ల కోడిపెట్ట పళ్ళెక కింద నుంచి బయటికి వచ్చి, వంటింటి కేసి పోవటం కనిపించింది. సుమంగ్ చప్పుడు కాకుండా లేచి వంటింటి వాకిలి దగ్గిరికి వెళ్ళి లోపలికి తొంగి చూశాడు.

కోడిపెట్ట ఒక్కసారి ఒళ్ళు విదిలించుకున్నది. దాని శరీరం ఊడి కింద పడి పోయింది. అందులో నుంచి, నిన్న మధ్యాన్నం వాడు చూసిన పిల్ల బయటికి వచ్చి, నిశ్శబ్దంగా వంట పనులు ప్రారంభించింది. సుమంగ్ కళ్ళు అప్పగించి చాలా సేపు ఆమెనే చూస్తూ ఉండిపోయాడు. ఆమె అందం నిజంగానే అద్భుతం.

వాడు తాను చేయదలిచిన దేదో నిశ్చయించుకుని వచ్చి మళ్ళీ పడుకున్నాడు.

తెల్లవారాక వాడు ముసలివాళ్ళ దగ్గిర శలవు పుచ్చుకుంటూ, ఒక బంగారుమాడ తీసి ముసలివాడి చేతిలో పెట్టి, "మీ నల్ల కోడి పెట్టను నాకు అమ్మండి," అన్నాడు.

ముసలివాడు కంగారుగా, "అది ఇంత ఖరీదు చేస్తుందా? కాని అది గుడ్లు కూడా పెట్టదే, నీ కేం పనికివస్తుంది? మా కంటే పిల్లాజెల్లా ఎవరూలేరు గనక దాన్ని సాకుతున్నాం," అన్నాడు.

"నాకు దాని మీద మోజు అయింది. కావలిస్తే ఇంకో బంగారుమాడ కూడా తీసుకో. కాని ఆ పెట్టను మాత్రం నా కిచ్చి తీరాలి," అన్నాడు సుమంగ్.

వాళ్ళ దరిద్రం తీరిపోవటానికి ఆ బంగారం చాల్ను. అందుచేత ముసలివాళ్ళు సుమంగ్‌కు ఆ కోడిపెట్ట నిచ్చారు. వాడు దాన్ని చంకన పెట్టుకుని బయలుదేరి ఇంటికి వచ్చాడు.

"నీ పెళ్ళాం ఏదిరా? ఒంటరిగా ఇంటికి రావద్దని చెప్పలేదూ?" అన్నది తల్లి.

"ఒంటరిగా రాలేదే. ఇదుగో నా పెళ్ళాం!" అంటూ తన చంకలో ఉన్న కోడిపెట్టను సుమంగ్ తల్లికి చూపాడు.

తన కొడుక్కు మతిపోయిం దనుకున్నది తల్లి. మతిపోయిన లక్షణాలు లేక



పోయేసరికి, వాడు తనతో వేళాకోళం ఆడుతున్నా డనుకున్నది. నిజంగానే వాడు కోడి పెట్టను పెళ్ళాడేసే ఉద్దేశంలో ఉన్నాడని తెలిశాక గూడెం వాళ్ళంతా తననూ తన కొడుకునూ పిచ్చివాళ్ళ కింద కట్టేసి గూడెం నుంచి వెళ్ళగొడతా రనుకున్నది. ఆమెకు మతి పోయినట్టయింది.

ఆ రోజు అర్ధరాత్రి నల్ల కోడిపెట్ట తన అలవాటు ప్రకారం వంట ఇంట్లోకి వెళ్ళి, మనిషి కాగానే సుమంగ్ ఆమె వెనకనే వెళ్ళి, ఆమెను కౌగలించుకుని, "ఎవరు నువ్వు? ఎందు కిలా కోడిపెట్టవూ, మనిషివీ అవుతున్నావు? నీ పేరేమిటి?" అని అడిగాడు.




ఆమె అతని పట్టు విడిపించుకోవాలని పెనగులాడింది.

"నేను నిన్ను వదలను. నిన్ను పెళ్ళాడటానికి తెచ్చుకున్నాను. నీ సంగతి చెప్పి తీరాలి," అన్నాడు సుమంగ్.

"నే నొక కోయదొర కూతుర్ని. నా పేరు జంత్రీ. మా గూడెం మంత్రగాడు నన్ను పెళ్ళాడతానన్నాడు. నేను ఒప్పుకోక పోయేసరికి నన్నిలా చేశాడు. ఒక్క ఝాము సేపే నేను మనిషిగా ఉండగలను. మిట్ట మధ్యాహ్నమూ, అర్ధరాత్రీ మనిషి అవుతాను. ఝాము సేపులోగా కోడిపెట్ట చర్మంలోకి ప్రవేశించకపోతే చచ్చిపోతాను. కోడి రూపంలో ఉండగా నన్నెవరన్నా పెళ్ళాడటానికి సిద్ధపడితే నాకీ శాపం పోతుంది," అన్నది జంత్రీ.

"సరే, నీ శాపం నేను తీరుస్తాను. భయపడకు," అన్నాడు సుమంగ్.

ఆ మాట వినగానే జంత్రికి అతని మీద ఎక్కడలేని అభిమానమూ వచ్చింది.

వాళ్ళిద్దరూ మాట్లాడుకునే సవ్వడికి సుమంగ్ తల్లి నిద్ర లేచింది. అమె వాళ్ళున్న గదిలోకి తొంగి చూసింది. తన కొడుకును ఒక దేవకన్యలాటి పిల్ల కౌగలించుకుని కబుర్లు చెప్పుతూ ఉండటం ఆమె కంట పడింది. మొదట ఆమెకంతా అయోమయంగా ఉన్నది. కాని వాళ్ళకు కొద్ది దూరంలో నల్ల కోడి చర్మం పడి ఉండటం కనపడగానే ఆమెకు అంతా అర్ధమయింది. ఆమె లోపలికి పాకుతూ వెళ్ళి ఆ చర్మం సంగ్రహించి, వారిద్దరికీ తెలియకుండా బయటికి వచ్చింది.

ఆమె అంతటితో ఆగక, ఆ రాత్రి గూడెం మధ్య వేసిన చలిమంట ఉండే చోటికి వెళ్ళి, నివురు కప్పిన ఆ నిప్పులలో కోడిపెట్ట చర్మాన్ని వేసింది.

మరుక్షణమే జంత్రి కెవ్వున అరిచి, బాధపడసాగింది.

"ఏమయింది, జంత్రీ?" అని సుమంగ్ ఆదుర్దాగా అడిగాడు.

"నా ఒళ్ళు కాలిపోతున్నది. నా కోడి చర్మాన్ని ఎవరో మంటలో వేశారు," అన్నది జంత్రి బాధతో మెలికలు తిరిగిపోతూ.

ఆమె విడిచిన చర్మం అక్కడ లేదు. సుమంగ్ పరిగెత్తుకుంటూ వెళ్ళి చలి మంటను పెద్దది చెయ్యటానికి ప్రయత్నించే తల్లిని చూశాడు. అతను ఆమెను వెనక్కు ఈడ్చి, నిప్పులను లక్ష్యపెట్టకుండా తొక్కుకుంటూ వెళ్ళి, కోడి చర్మాన్ని తీసి, కాలిన భాగాన్ని నలిపి శుభ్రం చేశాడు. బాగా నివురు కప్పి ఉండటం చేత చర్మం అటే కాలలేదు.

సుమంగ్ తల్లితో మాట్లాడకుండా, ఆమె పిలుస్తుంటే వినిపించుకోకుండా తన గుడిసెకు తిరిగి వచ్చాడు. ఇప్పుడు జంత్రి ఏ బాధా లేకుండా సంతోషంగా ఉన్నది. ఆమె తన చర్మంలోకి తిరిగి ప్రవేశించింది.

తెల్లవారగానే సుమంగ్ కోడిపెట్టను వెంట బెట్టుకుని కోయసభకు వెళ్ళాడు. అతను తమ నాయకుడి ఎదట మోకరించి, "దొరా, నాకూ ఈ కోడిపెట్టకూ పెళ్ళి చేయించు," అన్నాడు.

కోయవాళ్ళు కొందరు నవ్వారు. మరి కొందరు సుమంగ్‌ను తిట్టారు, కోయజాతి పరువు తీసేస్తున్నాడన్నారు. ఇంకా కొందరు,



"ఒరే, నిక్షేపం లాటి పిల్లలు చాలామంది ఉన్నారు. డబ్బు బాగా ఉన్నవాడివి గనక, కావలిస్తే పదిమందిని చేసుకో. కోడిపెట్టను పెళ్ళాడటమేమిటి?" అన్నారు.

"నేను కోడిపెట్టనే పెళ్ళాడబోతున్నాను. కారణం తరవాత మీకే తెలుస్తుంది," అన్నాడు సుమంగ్.

"ఇలాటి పని చేస్తే నిన్నూ, నీ తల్లినీ వెలివేసే అధికారం కోయసభ కున్నది తెలుసునా, నాయనా?" అని కోయదొర అడిగాడు.

"నేను నీ కోడిపెట్టను పెళ్ళాడాక గదా వెలివేస్తారు? ముందు పెళ్ళి చెయ్యండి. నన్ను మీరు వెలి వెయ్యరు సరే గదా నా పెళ్ళికి మీరంతా పెద్ద సంబరం చేసు కుంటారు. నా మాట నమ్మండి," అన్నాడు సుమంగ్.

అప్పటికీ కొందరు పెళ్ళి జరగరాదని పట్టు బట్టారు. కాని కోయదొరకు సుమంగ్ అంటే చాలా అభిమానం. అందుచేత, ముందు పెళ్ళి కానిద్దామనీ, అవతల వాణ్ణి వెలి వెయ్యటానికి సభ నిర్ణయిస్తే తాను ఏమీ అభ్యంతరం చెప్పననీ అతను అన్నాడు.

కోయ మంత్రవాది పెళ్ళి ఏర్పాట్లన్నీ చేసి మంత్రాలు చదివాడు. ఆ మంత్ర తంత్రాలు పూర్తి అయేలోపునే జంత్రి తన కోడిచర్మాన్ని వదిలేసి, అద్భుతమైన పెళ్ళి కూతురు ముస్తాబులో ప్రత్యక్షమయింది. అందరి కళ్ళూ జిగేలుమన్నాయి.

సుమంగ్ అన్నట్టే వాడి పెళ్ళికి గూడెం గూడెమంతా కోలాహలంగా సంబరం చేసు కున్నది. ఈ వార్త తెలిసి జంత్రి తండ్రి ఆరుకోసుల దూరం నుంచి వచ్చి, సుమంగ్ గూడెం వారందరికీ కత్తులూ, వడిసెలలూ, బాణాలూ, బట్టలూ, నెమలి ఈకలూ, ఏనుగుదంతం పనిముట్లూ, తేనే, చంద నమూ అంతులేకుండా బహుమానాల కింద తెచ్చి ఇచ్చి, కూతురినీ, అల్లుణ్ణీ దీవించాడు





# “లంబాడీ”

పూర్వకాలంలో రాజులు యుద్ధాలంటే భయపడేవాళ్ళు. కాని వాళ్ళకి తమకన్న చిన్నరాజులను జయించాలనే దురాశ మటుకు ఉండేది. కొందరు ఇతర రాజ్యాలను కాజెయ్యటానికి ఇతర రాజులను జూదాలకు ఆహ్వానించేవాళ్ళు. మరి కొందరు తాము జయించ దలిచినవారికి పరీక్షలు పెట్టి, అందులో వారు ఓడిపోతే వారి రాజ్యాలు కాజేసేవారు.

శమంతదేశాన్ని ఏలే కమలనాభు డనే రాజు తన పొరుగురాజైన ప్రసేనుణ్ణి జయించాలనీ, అతని రాజ్యాన్ని కాజెయ్యాలనీ చాలా గాఢంగా వాంఛించాడు. కావటానికి కమలనాభుడు ప్రసేనుడి కన్న బలవంతుడే, కాని యుద్ధం చేస్తే జననష్టమూ, ధననష్టమూ జరిగి తీరుతుంది. ప్రజా జీవితం దెబ్బతింటుంది. అన్ని వృత్తులూ అస్తవ్యస్త మవుతాయి. తిరిగి రెండుదేశాలూ కోలుకోవటానికి చాలా కాలం పట్టుతుంది. ఈలోగా ఇంకొక రాజు దండెత్తి వచ్చి, రెండు రాజ్యాలనూ కాజెయ్యవచ్చు.

అందుచేత కమలనాభుడు ప్రసేనుడికి ఒక సవాలు పంపాడు: “మనమిద్దరమూ రెండు రథాలు తయారుచేసి వాటికి పందెం పెడదాము. ఏ రథం ఎక్కువ వేగంతో పోతే అది చేయించినవారు గెలిచినట్టూ, రెండోవారు ఓడినట్టూ.”

ప్రసేనుడు ఒప్పుకోక చేసేది లేదు. తాను ఒప్పుకోనంటే కమలనాభుడు తన మీదికి సైన్యాలు పంపి యుద్ధం చేసి, మొత్తం దేశాన్ని కుక్కలు చింపిన విస్తరి చెయ్యగలడు.

అందుకని, ప్రసేనుడు తన రాజ్యంలో ఉన్న ప్రముఖ కమ్మర్ల నందర్నీ పిలిపించి, “మీ రంతా ఫలానా గడువులోగా ఒక గొప్ప రథాన్ని తయారు చెయ్యండి. అది

వి. భుజంగరావు



దృఢంగానూ ఉండాలి, అతి వేగంగా కదలాలి. మీరు తయారుచేసే రథాలలో ఉత్తమమైన దానికి గొప్ప బహుమానం ఇస్తాను," అని చెప్పాడు.

వెంటనే కమ్మరు లందరూ రథాలు తయారు చెయ్యటం ప్రారంభించారు. వారిలో ఒకడు కమ్మరంలో చాలా పేరు పడ్డవాడు. నిజానికి వాడు అందరి లాటి కమ్మరే గాని, వాడి వద్ద ఒక కుఱ్ఱవాడు తయారుతిన్నాడు. కమ్మరంలో వాడి ప్రావీణ్యం అసమానం. అన్ని విషయాలలోనూ వాడు చాలా సూక్ష్మబుద్ధి గలవాడే. వాడి జాతి ఏమిటో కూడా ఎవరికీ తెలీదు. వాడు పసితనం నుంచీ అనాథ. వాడి కొక పేరు కూడా లేదు. కమ్మరి వాణ్ణి "లంబాడీ" అని పిలిచేవాడు. అదే వాడి పేరయింది. లంబాడీ నైపుణ్యం వల్ల వాడి యజమాని ఎంతో ఆర్జించాడు, కాని లంబాడీ మటుకు జీతమూ, బత్తెమూ లేని నౌకరుగానే ఉండిపోయాడు.

రాజుగారి ఆజ్ఞ ప్రకారం తయారుచెయ్యవలిసిన రథాన్ని లంబాడీయే తయారు చేశాడు. రథా లన్నిటినీ పరీక్షించి, రాజుగారు లంబాడీ తయారు చేసిన రథాన్నే ఎన్నుకున్నాడు.

ఈ సంగతి తెలియగానే లంబాడీ రాజుగారి కోటకు వెళ్ళాడు. కోట ముందు రథం నిలబెట్టి ఉన్నది. జనం దాన్ని ఎగబడి చూస్తున్నారు. చిన్న పిల్లవాడు తోసినా అది కదులుతుంది. రాజుగారి కొలువు చేసే ఉద్యోగులు దాన్ని మెచ్చుకుంటున్నారు.

"ఇలాంటి రథం ప్రపంచంలో మరొకటి ఉండదు. గెలుపు మనదే!" అన్నా డొకడు.

"దీనికి మన రాజుగారి తెల్లగుర్రాలు పూన్చితే, ఇక అడిగావా?" అన్నాడు మరొకడు.

లంబాడీ వాళ్ళ మాటకు అడ్డు వచ్చి, "ఆ తెల్లగుర్రాలకు నేనే లాడాలు వేశా

నంటే అవి ఎలా పరిగెత్తుతాయో చూసుకోండి," అన్నాడు.

రాజుగారి ఉద్యోగులు, "నువ్వెవరు? నీ కేమిటి సంబంధం?" అన్నారు.

"దీన్ని నేనే తయారుచేశాను," అన్నాడు లంబాడీ.

"దీనికి రాజుగారు పెద్ద బహుమతి ఇచ్చారే. నువు గొప్ప ధనికుడి వన్నమాట!" అన్నారు ఉద్యోగులు.

"అంతా మా యజమాని తీసుకున్నాడు. నాకు గవ్వ కూడా ముట్టలేదు," అన్నాడు లంబాడీ. ఉద్యోగులు వెంటనే లంబాడీని రాజుగారి వద్దకు తీసుకుపోయారు. రాజుగారు తన ఉద్యోగులు చెప్పిన దంతా విని, "రథం తయారుచేసింది నువే అయి, నీ యజమాని నీ కేమీ ఇవ్వని మాట నిజమయితే, విచారణ జరిపి నీ యజమానిని తీవ్రంగా శిక్షిస్తాను. నువ్వేమీ విచారించకు," అన్నాడు లంబాడీతో.

"ఇప్పుడు నాకు కావలిసింది అది కాదు. తమ గుర్రాలకు నన్ను లాడాలు కొట్టనివ్వండి, అవి వాయువేగంతో పరిగెత్తి, పందెం గెలుస్తాయి," అన్నాడు లంబాడీ. రాజు సమ్మతించాడు.

అనుకున్న ప్రకారం ఉభయదేశాల సరిహద్దున ఉభయ రాజుల రథాలకూ పందెం





జరిగింది. ప్రసేనుడి రథం అవలీలగా గెలిచింది. తమ రథం ఓడిందన్న కసితో కమలనాభుడి రథాన్ని తోలేవాడు తన రథాన్ని వేగంగా తెచ్చి, గెలుపు హద్దులో నిలిచి ఉన్న ప్రసేనుడి రథానికి మోటించాడు. ఆ తాకిడికి కమలనాభుడి రథం ఇరుసు విరిగి దాని చక్రం ఒకటి పూర్తిగా భగ్నమయింది. ప్రసేనుడి రథం చెక్కు చెదరలేదు. దాంతో కమలనాభుడి అపజయం పరిపూర్ణమయింది.

ఇది జరిగాక రాజుగారు లంబాడీకి బోలెడంత ధనం ఇచ్చి, తన ముఖ్య సలహాదారుగా నియమించాడు.

కమలనాభుడి వద్ద కూడా ఒక మాయల మల్లి అనే ముసలిది ఉన్నది. ఈ రథాల పందెంలో దెబ్బతిన్నాక కమలనాభుడు మాయలమల్లిని పిలిచి, "ఈ అవమానానికి ప్రతీకారం చేయాలి. ప్రసేనుణ్ణి ఎలాగైనా జయించాలి. ఉపాయం చెప్పు," అన్నాడు.

"ఉపాయాల కేం? ఎన్నయినా ఉన్నాయి," అంటూ మాయలమల్లి కమలనాభుడి కొక ఉపాయం చెప్పింది.

తరవాత కొద్ది రోజులకు కమలనాభుడి దూతలు ప్రసేనుడి ఆస్థానానికి మూడు కట్టెలు ఒకే జాతివీ, ఒకే ప్రమాణం గలవీ తెచ్చి, "రాజా, కమలనాభ మహారాజుగారు మీ కీ కట్టెలను చూపమన్నారు. ఈ మూడూ ఒక్కసారి చెట్టు నుంచి కొట్టినవి కావు. వీటిలో ఏది మొదట కొట్టినదో, ఏది చివర కొట్టినదో చెప్పాలి. ఈ పరీక్షలో మీరు ఓడినట్టయితే మీరు ఓడినట్టు ఒప్పుకోవాలి," అని చెప్పారు.

"ఆలోచించి చెబుతాను," అన్నాడు ప్రసేనుడు.

ఆయన లంబాడీని పిలిపించి, "కమలనాభుడు మరో ఊడద తెచ్చి పెట్టాడు. ఈ మూడు కట్టెలలో ఏది మొదట కొట్టినదో, ఏది తరవాత కొట్టినదో, ఏది చివర

కొట్టినదో చెప్పాలట. ఏమన్నా ఉపాయం చెప్పగలవా?" అన్నాడు.

"అదేమంత కష్టం కాదు, మహారాజా. మూటినీ నీటిలో వెయ్యండి. ఏది చప్పున మునిగితే అది చాలాకాలం ఎండినది. ఏది మునగకపోతే అది చాలా పచ్చి ఉన్నది. మధ్యస్థమయిన కట్టె కొంచెం నింపాదిగా మునుగుతుంది," అన్నాడు లంబాడీ.

రాజు ఆ పరీక్ష ద్వారా ఏ కట్టె ఎప్పుడు కొట్టినదీ నిర్ణయించి, కమలనాభుడి దూతలకు జవాబు చెప్పి పంపించేశాడు.

"ప్రసేనుడు నా కన్న తెలివిగలవాడై ఉండాలి. నాకు తెలియని సమాధానం అతనెలా కనిపెట్టాడు?" అన్నాడు కమలనాభుడు మాయలమల్లితో.

"రాజులకు ఇంత తెలివితేటలు కూడానా?. ఆ ప్రసేనుడికెవరో తెలివైనవాడు సలహా లిస్తున్నాడు," అన్నది మాయలమల్లి.

"అలాటి వాడు ఉండే పక్షంలో మనం ప్రసేనుణ్ణి ఎలా ఓడించగలం?" అన్నాడు కమలనాభుడు.

"వాణ్ణి నేను తొలగిస్తాను. మీరు తొందర పడకండి. అలా చూస్తూవుండండి," అన్నది మాయలమల్లి.

ఆమె ఒక సన్యాసిని వేషం వేసుకుని ప్రసేనుడి రాజ్యానికి వెళ్ళింది. ఆమె ప్రసే





నుణ్ణి కలుసుకుని, సాముద్రికం చెబుతానని అతని చెయ్యి తీసుకుని, "అయ్యో, నాయనా! తెల్లనివన్నీ పాలనుకుంటావు. నువు గుడ్డిగా నమ్మిన వాడి వల్ల నీకు గొప్ప అపాయం ఉన్నది. వాణ్ణి వదిలించుకో!" అని సలహా ఇచ్చి తన దారిన తాను వచ్చేసింది.

ప్రసేనుడికి భయం పట్టుకున్నది. తాను గుడ్డిగా నమ్మినవాడు ఒక్కడే ఉన్నాడు— లంబాడీ. వాడు కులీనుడు కాడు. తెలివి తేటలు అమితంగా కలవాడు. అలాటి వాడు నమ్మకద్రోహం చెయ్యటానికి ఏ మాత్రమూ జంకడు. లంబాడీ వల్ల తనకు ఆపద ఉన్న దన్న భయంతో ప్రసేనుడు తన భటులను పిలిచి, "లంబాడీకి సమాధి కట్టండి. అతన్ని మధ్య ఉంచి, చుట్టూ ఎత్తుగా గోడలు కట్టెయ్యండి. ఇది నా ఆజ్ఞ," అన్నాడు.

ప్రసేనుడి కుమార్తె శుభాంగి అనేది లంబాడీని మొదటిసారి చూసినప్పటి నుంచీ అతన్ని అభిమానిస్తూ వస్తున్నది. అతని తెలివి తేటలను గురించి తెలుసుకుంటున్న కొద్దీ ఆమె అభిమానం ప్రేమగా మారింది.

ఆమె ఒకనాడు అంతఃపుర గవాక్షం నుంచి చూస్తుంటే దూరంగా తాపీ వాళ్ళు ఏదో కట్టుతూ ఉండటం కనిపించింది. ఆమె తాపీ వాళ్ళ మేస్త్రీని తన వద్దకు పిలిపించు కుని, "ఎటూ కాని చోట ఏమిటా కట్టేది?" అని అడిగింది.

"ముఖ్య సలహాదారుగారికి సజీవసమాధి కట్టమని రాజుగారి ఉత్తరు వయిందమ్మా," అన్నాడు మేస్త్రీ.

శుభాంగి నిర్ఘాంతపోయి, "ఏం? ఆయన ఏం చేశాడూ?" అని అడిగింది.

"మా కా సంగతి ఏమీ తెలియదమ్మా," అన్నాడు మేస్త్రీ.

రాజకుమార్తె తన వేలి నున్న ఉంగరం తీసి మేస్త్రీ కిస్తూ, "ఎవరికీ తెలియకుండా గోడలో ఒకరాయి వదులుగా ఉండేటట్టు అమర్చు. అది తియ్యటానికీ, మళ్ళీ పెట్ట

టానికీ వీలుగా ఉండాలి, ఇలా చేశావని రాజుగారికి తెలిసిందో నీ తల పగిలిపోతుంది. జాగ్రత్త," అన్నది.

ఆమె చెప్పినది గ్రహించినట్టు తల ఊపి మేస్త్రీ వెళ్ళిపోయాడు.

ఆ సాయంకాలం చీకటి పడే వేళ శుభాంగి కొత్త కట్టడం కేసి వెళ్ళి, వదులుగా ఉన్న రాయి తీసి, "లంబాడీ!" అని పిలిచింది.

తన గతి ఇలా ఎందుకైనదీ గ్రహించ లేక పుట్టెడు విచారంలో మునిగి ఉన్న లంబాడీ ఉలిక్కిపడి, "ఎవరదీ?" అన్నాడు.

"నేను, రాజకుమార్తెను. నీకు భోజనం తెచ్చాను," అన్నది శుభాంగి.

లంబాడీకి ప్రాణం లేచి వచ్చినట్టయింది. అతను గోడకంత వద్దకు వచ్చి, రాజకుమార్తె అందించిన భోజనం తీసుకుని, "మీ దయకు ఎంతైనా కృతజ్ఞుణ్ణి. కాని, రాజుగారు నాకి లాటి మరణ శిక్ష ఎందుకు విధించారో మీకేమైనా తెలుసా? నేనే తప్పు చేసి ఎరగను," అన్నాడు.

"మా నాన్న కెవరో చాడీలు చెప్పి ఉంటారు. ఆయన అసలే తొందరపాటు మనిషి. నిజం నిలకడ మీద అదే తేలు తుంది. కొద్ది కాలం నీ కీ చెర తప్పదు. నువు తిండికి మాడకుండా నేను రోజూ భోజనం తెచ్చిపెడతాను. కాస్త ఓపిక పట్టి





ఉండు," అని ధైర్యం చెప్పి శుభాంగి వెళ్ళిపోయింది.

మాయలమల్లి ఎత్తు పారిందని కమలనాభుడికి చారుల ద్వారా తెలిసింది. ఈసారి పరీక్ష పెడితే ప్రసేనుడు తనకు దాసోహం కాక తప్పదని ఆయన అనుకున్నాడు. ఎందుచేతనంటే లంబాడీ చచ్చే, చస్తానే ఉంటాడు.

కొద్ది రోజులు గడిచాయి. ఒకనాడు ప్రసేనుడి వద్దకు పన్నెండుమంది యువకులు వచ్చారు. అందరూ ఒకే ఎత్తున్నారు, ఒకే రకం దుస్తులు ధరించి ఉన్నారు. వాళ్ళు ప్రసేనుడితో, "రాజా, మమ్మల్ని కమలనాభ మహారాజుగారు పంపారు. మాలో ఒకడు ఆ మహారాజుకు కుమారుడు. అతనెవరో మీరు పోల్చుకో లేకపోతే మీరు మా రాజుగారికి ఓడినట్టు ఒప్పుకోవాలి. లేకపోతే యుద్ధం తప్పదు," అన్నారు.

ప్రసేనుడికి దడపుట్టుకొచ్చింది. ఇలాటి విపత్తుల నుంచి తనను లోగడ కాపాడిన లంబాడీ ఈపాటికి చచ్చిపోయి ఉంటాడు. తన కీసారి కమలనాభుడి దాస్యం తప్ప దనిపించింది.

శుభాంగి ఆయన విచారం కనిపెట్టి కారణ మడిగింది. ప్రసేనుడు చెప్పాడు.

"అప్పట్టు లంబాడీకి అతి క్రూరమైన మరణ శిక్ష ఎందుకు విధించావు? అడగా లనుకుని మరిచిపోతున్నాను," అన్నది శుభాంగి.

"బుద్ధి తక్కువై, ఒక బైరాగిముండ మాటలు విని, లంబాడీ నాకు ద్రోహం చేస్తాడని భయపడి అలా చేశాను. నిజానికి వాడు నాకు ఉపకారమే చేశాడు గాని అపకారం చెయ్యలేదు," అన్నాడు రాజు.

"ఆ సమాధి పగలగొట్టించి చూడు, ప్రాణాలతో ఉన్నాడేమో," అన్నది శుభాంగి.

"ఎప్పుడో పోయి ఉంటాడు. తిండి లేకుండా ఇన్నాళ్ళు బతుకుతాడా?"

అంటూనే రాజు సమాధి పగలగొట్టించాడు. లంబాడీ బతికి ఉండటమే గాక, ఎప్పటి కన్నా ఆరోగ్యంగా బయటికి వచ్చాడు.

రాజు అతనికి క్షమాపణ చెప్పుకుని తనకు వచ్చిన కొత్త ఉపద్రవం గురించి చెప్పాడు.

లంబాడీ కొంచెం ఆలోచించి, "ఈ రాత్రికి వారందరికీ వేళ బాగా తప్పించి, ఆకలి దహించుకుపోయేటట్టు చేసి, సత్తు కంచాలలో భోజనం పెట్టించండి. రాచ్చిప్ప లతో వడ్డన చేయించండి. రాజకుమారుడు తప్ప అందరూ భోజనం చేసేస్తారు. అప్పుడేం చెయ్యాలో నేను చెబుతాను," అన్నాడు.

కమలనాభుడు పంపిన పన్నెండుమంది యువకులకూ అర్ధరాత్రి కావస్తూండగా వడ్డన చేశారు.

"ఛీ, ఛీ! ఈ కంచా లేమిటి? వడ్డనకు ఈ రాచిప్ప లేమిటి? మేము భోజనం చెయ్యం," అన్నారు యువకులు.

"నన్ను మీరు క్షమించాలి. నేను పేద వాణ్ణి. భక్తితో పెట్టినది నిరాకరించరాదు. దయచేసి భోజనాలు చెయ్యండి. వంటకాలు రుచిగా ఉంటాయి. మా వంటవాళ్ళు ప్రసిద్ధులు," అన్నాడు ప్రసేనుడు.

నిజానికి వంటకాల వాసనే ఎంతో బాగు న్నది. ఒక్కొక్క యువకుడే భోజనానికి




ఉపక్రమించి, ఆకలి కొద్దీ అవురావురుమని భోజనం చేసేశారు. ఒక్కడు మాత్రం భీష్మించుకుని భోజనం చెయ్యనే లేదు.

"మహారాజా, అతనే రాజకుమారుడు. అతన్ని వెంటనే చెరలో పెట్టించండి," అన్నాడు లంబాడీ.

కమలనాభుడు పంపిన యువకులలో మిగిలిన పదకొండుమందీ తిరిగి వచ్చి, ప్రసేనుడి నుంచి సందేశం కూడా తెచ్చారు.

"తమకు సలహా ఇచ్చే ముసలిదాని తలను నా కళ్ళారా చూసిన నాడే నేను మీ కుమారుణ్ణి మీ వద్దకు తిప్పి పంపుతాను. అంతేగాక నాతో గిల్లికజ్జా పెట్టుకోనని మీరు ప్రమాణం చెయ్యాలి," అని ప్రసేనుడు, లంబాడీ సలహాపై, కమలనాభుడికి సందేశం పంపాడు.

కమలనాభుడి ఆటకట్టయింది. ఆయన మాయలమల్లిని తన వెంట తీసుకు వచ్చి ప్రసేనుడి కాళ్ళ పైన పడేసి, "దీన్ని మీ యిష్టం వచ్చినట్టు శిక్షించండి. నా కున్న ఒక్క కొడుకుకూ ఏ ఆపదా రానివ్వకండి. నే నిక మీ జోలికి రానని నా తండ్రితాతల మీద ప్రమాణం చేస్తున్నాను," అన్నాడు.

కమలనాభుడి కొడుకు లంబాడీ ద్వారా తన తండ్రి కుయుక్తులను గురించి విని, ప్రసేనుడు తనను నిర్బంధించటం సబబే నని ఒప్పుకున్నాడు.

సమాధిలో లంబాడీ చావకుండా అన్నాళ్ళుండటానికి కారణం తన కుమార్తె నని తెలిసి, ప్రసేనుడు లంబాడీకి శుభాంగి నిచ్చి పెళ్ళి చేశాడు. ఆ పెళ్ళి విందులూ, వేడుకలూ అయాకనే కమలనాభుడూ, ఆయన కుమారుడూ తమ దేశానికి తిరిగి వెళ్ళారు.

కమలనాభుడి అనంతరం ఆయన కొడుకూ, ప్రసేనుడి అనంతరం లంబాడీ రాజు లయారు. వారి హయాంలో ఉభయ దేశాల మధ్యా స్నేహభావం మరింత బలపడింది.






# మకురుతనానికి మందు

అరేబియా దేశంలో ఒక భూస్వామి ఉండేవాడు. ఆయనకు పశు పక్ష్యాదుల భాషలన్నీ తెలుసు. ఆయన వద్ద ఒక గుర్రమూ, ఒక ఎద్దూ ఉండేవి.

ఒకనాడు ఎద్దు గుర్రం ఉండే కొట్టంలోకి తొంగి చూసింది. అది చాలా పరిశుభ్రంగా ఉన్నది. ఎద్దు గుర్రంతో, "తమ్ముడూ, జన్మ అంటే నీదే జన్మ. నీకు పని తక్కువ. సుఖమైన భోజనం. నా దంటావా? గొడ్డు చాకిరి. పొలంలో రొచ్చులో పని చెయ్యాలి. చెత్త తిండి తినాలి," అన్నది.

ఆ మాట విని గుర్రం, "అన్నా, నేను చెప్పినట్టు చేస్తే నువ్వూ సుఖపడిపోతావు. నిన్ను పొలం దున్నటానికి తీసుకుపోతే కింద పడిపోయి, లేవకు. నాలుగు కొట్టినా సరే అలాగే పడి ఉండు. తరవాత మేత వేస్తే తినకు. నీకు జబ్బు చేసిందనుకుని యజమాని నీకు విశ్రాంతి ఇచ్చి, తినటానికి చిక్కుళ్ళూ, పచ్చిగడ్డీ వేస్తాడు. హాయిగా మూడు రోజులపాటు మంచి భోజనమూ విశ్రాంతీ లభిస్తాయి," అన్నది.

జంతువుల భాష తెలిసిన యజమాని రెండిటి సంభాషణా విన్నాడు.

ఆ రాత్రి మేత వేస్తే ఎద్దు దాన్ని ముట్ట లేదు. మర్నాడు పొలానికి తీసుకుపోయి కాడి గట్టితే, కూలబడిపోయి జబ్బుగా ఉన్నట్టు కనిపించింది. యజమాని తన పనివాళ్ళతో, "ఎద్దును తీసుకుపోయి గుర్రాన్ని పట్టుకురండి," అన్నాడు. గుర్రం రోజల్లా పొలం పని చేసి, చచ్చి చెడి ఇంటికి తిరిగి వచ్చింది.

"తమ్ముడూ, నీ పుణ్యమా అంటూ నేను రోజల్లా చక్కగా విశ్రాంతి తీసుకున్నాను," అన్నది ఎద్దు గుర్రంతో.

మర్నాడు కూడా యజమాని గుర్రం చేతనే పొలం పని చేయించాడు. కాడి

ఆర్. సత్యనారాయణ



ఒరుసుకుని దాని మెడ అంతా పుండు పడింది. అలవాటులేని పని చేసి ఒళ్ళంతా హూనమయింది. అది పొలం నుంచి ఇంటికి తిరిగి వస్తూనే, "అన్నా, కొంచెం జాగ్రత్తగా ఉండు. రేపు కూడా నువు లేచి పని చెయ్యలేకపోతే యజమాని నిన్ను కసాయివాడి కిచ్చి, నీ తోలుతో కొత్త చెప్పులు చేయించుకుంటానని పనివాళ్ళతో అంటున్నాడు. తరవాత నీ యిష్టం," అని ఎద్దుతో అన్నది.

ఈ మాటకు ఎద్దు కంగారు పడి, "లేదు, లేదు. రేపటి నుంచీ నేనే పొలం పనిలోకి పోతాను. రెండు రోజులు విశ్రాంతి తీసు



కున్నాను కద!" అన్నది. ఈ సంభాషణ కూడా యజమాని చెవినపడింది.

మర్నాడు ఉదయం తన యజమానిని చూస్తూనే ఎద్దు తోక ఆడించి, చెంగు చెంగున ఎగరసాగింది.

అది చూసి యజమాని పొట్టచెక్కలయేటట్టు నవ్వసాగాడు. ఆ సమయంలో ఆయన సమీపంలోనే ఉన్న ఆయన భార్య, "ఎందుకా నవ్వు? అంతహాస్యం ఏం జరిగింది?" అన్నది.

"అది రహస్యం. చెప్పటానికి వీల్లేదు," అన్నాడు భర్త.

"నన్ను చూసే నవ్వుతున్నావు. అందుకే చెప్పటం లేదు," అన్నది భార్య.

"నిన్ను చూసి కాదు నవ్వుతున్నది. అది వేరే విషయం," అన్నాడు భర్త.

"ఏ విషయమైనా కానీ, నాకు వెంటనే చెబుతావా, చెప్పవా?" అని భార్య మూర్ఛించింది.

"చెబితే నేను చచ్చిపోతాను. ఎలా చెప్పమంటావు?" అన్నాడు.

"చచ్చినా సరే, నాకు ఆ రహస్యం ఏమిటో చెప్పి తీరాలి," అన్నది భార్య.

ఆమె పోరుపడలేక, తన నవ్వుకు కారణమేమిటో ఆమెకు చెప్పి చచ్చి పోవటానికి



నిశ్చయించుకుని భర్త తన బంధువుల నందరినీ ఆహ్వానించాడు.

మర్నాడు ఉదయం బంధువులంతా సావట్లో సమావేశమయారు. "కాలకృత్యాలు తీర్చుకుని ఇప్పుడే వస్తా," అని భూస్వామి బయటికి వెళ్ళాడు. బయట ఆయన కుక్కా, ఒక కోడిపుంజూ ఉన్నాయి.

పురుగులేరుకు తింటున్న కోడిపుంజును చూసి కుక్క, "ఒక వంక మన యజమాని చావటానికి సిద్ధంగా ఉంటే, నీకు చీమ కుట్టినటన్నా లేదా?" అని అడిగింది.

కోడిపుంజు తలఎత్తి, "మన యజమాని చావటం దేనికి?" అని కుక్కను అడిగింది. కుక్క దానికి సంగతంతా చెప్పింది.

"మన యజమానికి కొంచెం కూడా బుద్ధి లేదు. నాకు యాభై పెట్ట లున్నాయి. వాటిని ముద్దు చేసినప్పుడు ముద్దు చేసినా, మకురుతనం చేస్తే పొళ్ళు వాయగొడతాను. ఒక్క భార్య ఉండికూడా మన యజమాని ఆవిడ ఆటలు సాగనియ్యట మేమిటి?" అన్నది కోడిపుంజు.

భూస్వామి ఈ సంభాషణ కూడా విన్నాడు. అతను ఇంటికి వచ్చేటప్పుడు రెండు చింతబరికెలు విరిచి తెచ్చుకుని, "నువ్వడిగిన రహస్యం చెబుతాను, లోపలికి రా!" అని తన భార్యను లోపలి గదిలోకి తీసుకుపోయి, ఆ చింతబరికెలతో వీపు చిట్లగొట్టాడు.

"అమ్మో, బాబో! నాకు నీ రహస్యం వద్దు! బతికి ఉండనీ!" అని భార్య కాళ్లా వేళ్ళా పడ్డాక కొట్టటం ఆపేశాడు. ఇద్దరూ బంధువులున్న చోటికి వచ్చారు.

"నా భార్య కోరిక తీర్చాను. కావలిస్తే ఆమెను అడగండి," అన్నాడు భర్త.

బంధువులంతా పరమానందం చెంది, ఆ పూట విందుకుడిచి వెళ్ళిపోయారు.

ఆ తరవాత భూస్వామి భార్య తన భర్త దగ్గిర ఎన్నడూ మకురుతనం చెయ్యలేదు.





# సహజీవనం

ఒక అరణ్యప్రాంతంలో ఒక ముసలివాడు తన గుడిసెలో ఒంటరిగా జీవిస్తూ ఉండేవాడు. వాడికి రోజులు సుఖంగానే వెళ్ళిపోతూ వచ్చాయి, కాని ఒక బావురుపిల్లి అడపాతడపా వాడి కోళ్ళను కాజేస్తూ ఉండేది. దాన్ని పట్టటానికి ముసలివాడు కోళ్ళగూడు చుట్టూ ఎన్ని ఉచ్చులో పన్నాడు, కాని బావురుపిల్లి చిక్కనేలేదు. ఇంతలో వాడికే కాలం మూడింది.

ఈసారి కోడి కోసం వచ్చిన బావురుపిల్లి మనిషిశవాన్ని చూసి, ఎంతో సంతోషించి, "అహా, బోలెడంత తిండి. చాలాకాలం పాటు వేటాడే పనిలేదు," అనుకుని, ముసలాడి శవాన్ని తానుండే చోటికి లాక్కుపోదామనుకున్నది. కాని అది బావురుపిల్లికి సాధ్యంకాలేదు.

ఎవరన్నా సాయంపడతారేమో నని అటూ ఇటూ చూస్తూండగా పిల్లి కొక ఉడత కనిపించింది; "ఉడతా, ఉడతా! మనిద్దరికీ బోలెడన్ని రోజులు సరిపడే ఆహారం ఉంది. కాలం తీరి ముసలివాడు చెప్పాపెట్టకుండా చచ్చాడు. ఈ కళేబరాన్ని లాక్కుపోవటానికి తోడు వస్తావా?" అన్నది.

ఉడత సరేనన్నది. అయితే, ఇద్దరూ కలిసి ఎంత గింజుకున్నా, లాగినా శవం కదలలేదు.

ఇంతలో వాళ్ళ కొక కుందేలు కనిపించింది. పిల్లి కుందేలును కూడా తమ సమాజంలోకి చేర్చుకున్నది. కాని ముగ్గురూ కలిసినా పని జరగలేదు. క్రమంగా, ఆ దారే పోతూ అక్కడికి వచ్చిన ఒక నక్క, ఒక తోడేలూ, ఒక ఎలుగుగొడ్డూ కూడా సమాజంలో చేరాయి.

"మనం యావజ్జీవం మిత్రులుగా ఉంటూ సహజీవనం చేద్దాం. అందరమూ కలిసే ఆహారం సంపాదించి, మన అవస

ఎస్. కోదండపాణి

రాలకు తగ్గట్టుగా పంచుకుందాం!" అని ఆ ఆరూ ఒట్టు లేసుకుని, ప్రమాణాలు చేసుకున్నాయి.

ఇప్పుడు శవాన్ని కదిలించే అవసరం కూడా లేకపోయింది. ఆరుగురి పొట్టలూ నిండేసరికి ముసలాడి ఎముకలు తప్ప ఇంకేమీ మిగలలేదు.

త్వరలోనే అందరికీ కడుపుల్లో నకనక లాడసాగింది. అప్పుడు ఎలుగుబంటి, "మిత్రులారా, నాకు ఆకలి దహించుకు పోతోంది. మన సమాజం ఏదో ఒకటి చెయ్యకపోతే నా ప్రాణాలు నిలిచేలాగా లేవు," అన్నది.

"అయితే యిది చాలా గడ్డు సమస్యే! ఇప్పుడేం చేద్దామంటావు?" అన్నాయి మిగతా జంతువులు.

"చేసేటందు కేముందీ? అందరమూ కలిసి మనలోకెల్లా చిన్న ప్రాణిని తినెయ్యటమే. అంతకన్న ప్రాణాలు నిలుపుకునేందుకు మరోమార్గం లేదుగదా," అన్నది ఎలుగుబంటి.

ఈ మాటలు వింటూనే ఉడత, తనకు రానున్న ఆపదను గుర్తించి సత్వరున దగ్గిర నున్న చెట్టెక్కి, ఒక చెట్టు మీదినుంచి ఇంకొక చెట్టుకు దూకుతూ అంతులేకుండా పోయింది.





"చూశారా, ఈ ఉడతకు స్నేహభావం ఏమీలేదు. మిగిలినవాళ్ళ కోసం కొంచెం కూడా త్యాగం చెయ్యలేక పోయింది," అంటూ ఎలుగుబంటి కుందేలును పట్టబోయింది. వెంటనే కుందేలు పరిగెత్తి, పొదల్లో మాయమయింది. రానున్న ప్రమాదాన్ని పసిగట్టిన బావురుపిల్లి కూడా పరిగెత్తి పెద్ద మాను చూసుకుని చిటారు కొమ్మకు ఎగబాకింది.

"ఆరుగురిలోనూ ముగ్గురు జారుకున్నారు. వాళ్ళు ఎంతమాత్రమూ స్నేహపాత్రులు కారు. పోతే పోయారు. ఇక యిక్కడ మిగిలిన ముగ్గురిలో నువే చిన్న గనక నిన్ను మేమిద్దరమూ తింటాం," అన్నది ఎలుగుబంటి నక్కతో.

"నాకేమీ అభ్యంతరం లేదు. అయితే ఈ గుడిసెలో, ఈ చీకట్లో ఏమిటి? హాయిగా కొండ మీదికి పోదాం. అక్కడ నేను మీకు ఆహారం అవుతాను," అన్నది నక్క.

ఎలుగుబంటి ఇందుకు సమ్మతించి కొండ మీదికి దారి తీసింది. దానికి వెనకనే నడుస్తున్న నక్క చిన్నగా తోడేలుతో, "అన్నా, నన్ను తిన్న తరవాత మీ ఇద్దరికీ మళ్ళీ ఆకలి వేస్తుంది గదా, అప్పుడేం చేస్తారు?" అన్నది.

తోడేలు వెలవెల పోయింది. నక్క అయిపోయాక ఎలుగుబంటికి ఆహారం కావటం తన వంతు అన్న సంగతి తోడేలుకు స్ఫురించింది.

"ఈ ఏర్పాటు ఏమీ బాగాలేదు. సహజీవనం పేరిట మనం వేటాడటం మానేసి, ఒకరి నొకరు తింటున్నాం," అన్నది తోడేలు. అది ఎలుగుబంటిని వెనక్కు పిలిచి, "మే మిద్దరమూ సహజీవనానికి విరుద్ధంగా వోటు చేస్తున్నాం. ఇక ఎవరి మానాన వారు బతుకుదాం," అన్నది.

ఇష్టంలేకపోయినా ఎలుగుబంటి ఇందుకు ఒప్పుకోక తప్పలేదు.





# మహాభారతం

శుక్రుడు తనను ముసలివాడు కమ్మని శపించగానే యయాతి శుక్రుడి కాళ్ళవేళ్ళ పడి, "నన్ను శపించటం న్యాయ్యం కాదు. శర్మిష్ఠ పుత్రభిక్ష వేడింది. ఆమె కోరిక తీర్చకపోతే నాకు భ్రూణహత్య చేసిన పాపం చుట్టుకుంటుంది. అందుకని ఆమె కోర్కె తీర్చాను. అంతేగాని దేవయానికి అన్యాయం చేసే ఉద్దేశం నాకు లేదు. నన్ను మన్నించండి," అన్నాడు.

"నా శాపం వ్యర్థం కావటం ఎన్నటికీ జరగదు. అయితే నువ్వింకా కొంతకాలం యౌవనం అనుభవించగోరినట్టయితే, నీ ముసలితనం ఎవరైనా యువకుడి కిచ్చి, వాడి యౌవనం నువు పుచ్చుకునేటందుకు అవకాశం ఇస్తాను," అన్నాడు శుక్రుడు.

తన ముసలితనం తీసుకుని యౌవనం ఇవ్వమని పరాయివాళ్ళను అడిగేకన్న తన కొడుకులనే అడిగి, అందుకు సమ్మతించే వాడికే తన అనంతరం రాజ్యాభిషేకం జరిగేటట్టు చేస్తే బాగుంటుందని యయాతి ఆలోచించాడు. అందుకు శుక్రుడు సమ్మతించాడు.

యయాతికి వెంటనే ముసలితనం వచ్చేసింది. తల వణికింది. కీళ్ళు పట్టు తప్పాయి. జుట్టు నెరిసింది. ముఖమంతా ముడతలు పడింది. ఉబ్బసరోగం పట్టుకున్నది. ఆ స్థితిలో ఆయన తన పెద్ద కొడుకైన యదువును పిలిచి, అతనికి తన శాపం గురించి చెప్పి, "నాయనా, కొంత కాలం నా ముసలితనం నువు పుచ్చుకుని,



నీ యౌవనం నా కిస్తావా? ఆ తరవాత నీ యౌవనం నీ కిచ్చి నా ముసలితనం నేను తీసుకుంటాను," అన్నాడు.

యదువు ఈ ఏర్పాటుకు ఎంత మాత్రమూ ఒప్పుకో లేదు. యయాతి మండిపడి, యదువుకూ, అతని సంతతి అయిన యాదవులకూ రాజ్యార్హత లేకుండా చేశాడు. యదువు ఒకడేగాదు, యయాతి కొడుకులు మిగిలిన వాళ్ళుకూడా తండ్రి ముసలితనాన్ని స్వీకరించటానికి ఒప్పుకో లేదు. శర్మిష్ఠ కొడుకులలో చిన్నవాడైన పూరు డొక్కడే తండ్రి చేసే ఏర్పాటుకు సమ్మతించాడు. శుక్రుడి దయవల్ల యయాతి తన ముసలితానాన్ని పూరుడి కిచ్చి, పూరుడి యౌవనాన్ని తాను పొంది, విశ్వాచి అనే అప్సరసను వెంట బెట్టుకుని అందమైన స్థలాలలో విహరించుతూ, యథేచ్ఛగా సుఖించాడు. ఇలా కొంతకాలం జరిగాక ఆయన పూరుడికి తన యౌవనాన్ని ఇచ్చి, ముసలివాడై, పూరుడికి రాజ్యాభిషేకం చేశాడు.

పూరుడికి పౌష్టి, కౌసల్యా అని ఇద్దరు భార్యలు. ఇద్దరికీ పుత్రులు జన్మించారు. కౌసల్యకు పుట్టిన కొడుకుల సంతతిలో, జనమేజయు డనేవాడి పరంపరలో పదహారో తరం వాడుగా దుష్యంతు డనేవాడు పుట్టాడు. దుష్యంతుడికీ, విశ్వామిత్రుడి కుమార్తె అయిన శకుంతలకూ భరతు డనే అతి చక్కని కొడుకు కలిగాడు.

విశ్వామిత్రుడికి కుమార్తె ఎలా కలిగిందంటే—

ఒకప్పుడు విశ్వామిత్రుడు అతి తీక్షమైన తపస్సు చేశాడు. ఆ తపస్సు చూసి ఇంద్రుడు భయపడి, మేనక అనే అప్సరను పిలిచి, "విశ్వామిత్రుడు ఘోరమైన తపస్సు చేస్తున్నాడు. ఆ తపస్సు పూర్తి అయితే దేవతలకు అపాయం కలుగుతుందని నాకు భయంగా ఉన్నది. అందు

చేత నువు వెళ్ళి, నీ చాతుర్యమంతా వినియోగించి విశ్వామిత్రుడి తపస్సు భంగం చెయ్యి," అన్నాడు.



విశ్వామిత్రుడు సామాన్యుడు కాడు. ఆయన రాజవంశంలో పుట్టి, తన తపశ్శక్తి చేత బ్రాహ్మణుడయాడు. మహా ముక్కోపి. వశిష్ఠుడంతటివాడికే పుత్రశోకం కలిగించాడు. శాపంచేత చండాలుడైపోయిన త్రిశంకు చేత ఆయన యజ్ఞం చేయిస్తే, ఆయనకు భయపడి ఇంద్రుడే వెళ్ళి హవిర్భాగం పుచ్చుకున్నాడు. ఆ త్రిశంకుణ్ణి విశ్వామిత్రుడు తన శక్తిచేత స్వర్గానికి పంపి, దేవతలు తోసెయ్యగా కిందపడి పోతున్న త్రిశంకుడికి అంతరిక్షంలో ఒక స్వర్గం సృష్టించి అందులో అతన్ని నిలిపాడు. ఇదంతా తెలిసి కూడా మేనక విశ్వామిత్రుడి తపస్సు భంగం చెయ్యటానికి బయలుదేరి విశ్వామిత్రుడున్న ఆశ్రమానికి వచ్చింది.

మేనక విశ్వామిత్రుడికి కనబడి నమస్కారం చేసి, ఆ ఆశ్రమంలో విహరించ సాగింది. గాలికి చెదిరిపోయే చీరను సరి చేసుకుంటూ తిరుగుతున్న మేనకను చూడగా చూడగా, దాని అందానికి విశ్వామిత్రుడి మనస్సు చెదిరిపోయింది. ఆయనలో కలిగిన వికారాన్ని గమనించి మేనక తాను వచ్చిన పని నెరవేరుతున్నదనుకుని, ఆయనకు వశురాలయింది. వారి దాంపత్య ఫలితంగా మేనకకు ఒక అందమైన కూతురు పుట్టింది. ఆ పసిగుడ్డును మాలినీనదీ తీరాన నిర్జనారణ్యం మధ్య ఉంచి, తన మానాన తాను దేవలోకానికి మేనక తిరిగి వెళ్ళిపోయింది.

క్రూరమృగాలు స్వేచ్ఛగా తిరిగే ఆ ప్రాంతంలో ఆ పసిబిడ్డను శకుంతపక్షులు తమ రెక్కలతో కప్పి కాపాడాయి. మధ్యాన్నం వేళ కణ్వమహాముని స్నానం చెయ్యటానికి వచ్చి, శకుంతపక్షుల రెక్కల

నీడన సురక్షితంగా ఉన్న ఆ బిడ్డను చూసి, చుట్టుపక్కల ఆ బిడ్డ తాలూకు మనుషు లెవ్వరూ లేకపోవటం చేత, ఆ బిడ్డను దగ్గిర లోనే ఉన్న తన ఆశ్రమానికి తీసుకుపోయి, శకుంతల అనే పేరు పెట్టి, తన కూతురి లాగే పెంచ నారంభించాడు. శకుంతల కూడా నానాటికీ పెరుగుతూ, కణ్వమహా మునినే తన తండ్రిగా భావించి, ఆశ్రమంలో పనులన్నీ చేస్తూ వస్తున్నది.

ఒకనాడు దుష్యంతుడు మాలినీనదీ తీరానికి సపరివారంగా వేటకు వచ్చి, అక్కడ కణ్వమహాముని ఆశ్రమాన్ని చూశాడు. అది చాలా గొప్ప ఆశ్రమంగా అతనికి తోచింది. మునికుమారులు వేదపఠనం చేస్తున్నారు. కొందరు అగ్నిలో హవిస్సులు వేల్చుతున్నారు. ఒకచోట అధ్యయనమూ, చర్చా జరుగుతున్నది. సామగానం విని పిస్తున్నది.

దుష్యంతుడు తన పరివారాన్ని ఆగమని చెప్పి, తాను ఒక్కడే ఆశ్రమం ప్రవేశించి కణ్వుడి కుటీరానికి వచ్చాడు. కుటీరంలో కణ్వుడు లేడు. లోపల ఎవరని దుష్యం తుడు గట్టిగా పిలిచేసరికి, తాపస స్త్రీ వేషంలో ఉన్న శకుంతల లోపలి నుంచి వచ్చింది. ఆమె దుష్యంతుణ్ణి చూస్తూనే రాజని గ్రహించి, అతనికి అర్ఘ్యపాద్యా



లిచ్చి, అతిథి సత్కారాలు చేసి, "మీకేం కావాలి?" అని అడిగింది.

ఎంతో అందంగానూ, సుకుమారంగానూ ఉన్న శకుంతలను చూసి దుష్యంతుడు ఆమె అతిథిమర్యాదకు చాలా ఆశ్చర్య పడుతూ, "అమ్మాయీ, నే నిక్కడి అర ణ్యాలలో వేటాడ వచ్చి, కణ్వమహాముని దర్శనం చేసుకుని పోదా మనుకున్నాను. ఆయన కుటీరంలో లేరా? ఎటువెళ్ళారు?" అని అడిగాడు.

"ఆయన నా తండ్రి. ఫలాలూ, సమి ధలూ తీసుకు రావటానికి వెళ్ళారు. ఒక్క క్షణం ఆగితే వచ్చేస్తారు," అన్నది శకుంతల.

శకుంతల మాట్లాడే సొంపు చూస్తున్న కొద్దీ దుష్యంతుడికి ఆమె మీద మోహం జాస్తి కాసాగింది. ఆమె కన్య అని తెలు స్తూనే ఉన్నది. అతను శకుంతలతో, "కణ్వమహాముని బ్రహ్మచర్య వ్రతం పూనినవాడని విన్నాను. ఆయన నీకు తండ్రి ఎలా అయారు? అసలు నువ్వెవరి బిడ్డవు? ఈ ఆశ్రమంలోకి ఎలా వచ్చావు? నిన్ను చూసిన మాత్రం చేతనే నా మనసు నీ కేసి ఆకర్షించబడుతున్నది. నిజం సంగతి చెప్పు," అన్నాడు.

తన జన్మవృత్తాంతాన్ని శకుంతల అదివరకే, కణ్వమహాముని మరొక మునికి





చెప్పుతుండగా విని ఉన్నది కావటంచేత, దుష్యంతుడికి చెప్పేసింది.

"అయితే, నువు రాజకన్యకవే నన్న మాట. ఇంత చక్కని దానివి, ఇంత సుగుణవతివి, ఇలా నారబట్టలు కట్టి, అడవి పళ్లు తింటూ ఈ ఆశ్రమ కుటీరంలో నివసించటం నా కేమీ నచ్చలేదు. నాకు భార్యవై నా రాజభవనంలో సమస్త సుఖాలూ అనుభవించు. నా రాజ్యానికి నువే రాణివిగా ఉండు," అన్నాడు దుష్యంతుడు.

"అడవికి వెళ్ళిన మా నాన్నగారు రాగానే ఆయన అనుమతి పొంది, మీరు నన్ను పెళ్ళాడండి," అని శకుంతల అన్నది.



తనకు భార్య కావాలని ఆమెకు కోరిక ఉన్నట్టు దుష్యంతుడికి స్పష్టమయింది. అతను శకుంతలతో, "చూడు, నా మనస్సు నీ కోసం పరితపిస్తున్నది. గాంధర్వ వివాహం క్షత్రియులకు చెల్లుతుంది. గాంధర్వ వివాహానికి మంత్ర తంత్రాలు అవసరం లేదు. వధూవరుల ఇష్టమే తప్ప పై వాళ్ళ అనుమతితో అవసరం లేదు. అది రహస్య వివాహం," అన్నాడు,

తనకు అతనివల్ల కొడుకు పుట్టే పక్షంలో ఆ కొడుకును దుష్యంతుడు యువరాజును చేసే షరతు మీద శకుంతల అతనితో గాంధర్వ వివాహానికి ఒప్పుకున్నది. వారిద్దరూ అప్పుడే భార్యాభర్త లయారు. దుష్యంతుడు శకుంతలకు వీడ్కోలు చెప్పి వెళ్ళిపోతూ, "నేను మా నగరానికి వెళ్ళి, నిన్ను తీసుకు రావటానికి మనుషులను పంపుతాను," అని శకుంతలకు నచ్చ చెప్పాడు. ఈ సంగతి కణ్వమహాముని కి తెలిస్తే ఆయన కోపించి ఏం చేస్తాడో నని దుష్యంతుడికి మనసులో భయంగానే ఉన్నది. శకుంతలకు కూడా అలాటి భయమే ఉన్నది.

తరవాత కణ్వమహాముని కందమూల ఫలాలు తెచ్చి పడేసి, కాళ్ళూ, చేతులూ





కడుక్కొని వచ్చి కూర్చున్నాడు. శకుంతల సిగ్గు పడుతూ, భయపడుతూ వచ్చి దగ్గిర నిలబడింది. ఆయన దివ్యదృష్టితో జరిగినది గ్రహించి, "అమ్మా, నువు తగిన భర్తనే పెళ్ళాడావు. ఈ గాంధర్వ వివాహం ఫలితంగా నీకు మహా చక్రవర్తి కాదగిన కొడుకు పుడతాడు. నీకేమన్నా కోరిక ఉంటే చెప్పు," అన్నాడు.

"నాకు పుట్టబోయే కొడుకు దీర్ఘాయు రైశ్వర్య బలాలు కలవాడేగాక వంశకర్తగా కూడా ఉండాలని నా కోరిక," అన్నది శకుంతల. అలాగే అవుతుందన్నాడు కణ్వుడు. శకుంతల మనస్సు ఊరట చెందింది.

కాలక్రమాన శకుంతల ఒక కొడుకును కన్నది. కణ్వమహాముని ఆ కుర్రవాడికి శాస్త్రోక్తంగానూ, క్షత్రియోచితంగానూ జాత కర్మ మొదలైనవి చేశాడు. ఆ కుర్రవాడు శుక్లపక్ష చంద్రుడిలాగా పెరుగుతూ, ఆరేళ్ళు వచ్చేసరికే సింహాలనూ, పులులనూ, ఏనుగు లనూ ఎక్కి తిరగటమూ, వాటిని ఆశ్రమంలో ఉండే చెట్లకు కట్టెయ్యటమూ మొదలైన పనులు చేసి, ఆశ్రమంలో ఉండే ముని లను హడలగొట్టసాగాడు. వాణ్ణి ఆశ్రమంలో అందరూ సర్వదమను డని పిలిచేవారు.

ఒకనాడు కణ్వమహాముని శకుంతలతో, "అమ్మా, నీ కొడుకు ఇప్పుడే యువరాజు కాదగినట్టుగా ఉన్నాడు. వాడు వాడి తండ్రి దగ్గిర ఉండటం మంచిది. నువ్వయినా, భర్త ఉండగా ఎంత కాలమని పుట్టింట ఉంటావు? నిన్ను నీ భర్త వద్దకు పంపు తాను," అన్నాడు.

కణ్వుడి శిష్యులు కొందరు శకుంతలనూ ఆమె కొడుకునూ వెంట బెట్టుకుని దుష్యంతుడి నగరానికి వెళ్ళి, ఆమె వద్ద అనుమతిపొంది ఆశ్రమానికి తిరిగి వెళ్ళారు.

ద్వారపాలకుడు శకుంతలనూ, ఆమె కొడుకునూ దుష్యంతుడి వద్దకు వెళ్ళ

నిచ్చాడు. కాని శకుంతలను చూసి దుష్యంతుడు గుర్తుపట్టినట్టు కనిపించ లేదు. శకుంతలకు గుండెలో గుబులు పుట్టుకొచ్చింది. ఆమె అతనితో, "రాజా, నువ్వొకసారి వేటాడుతూ కణ్వాశ్రమానికి వచ్చిన మాట మరిచావా? వీడు నీ కొడుకు. వీణ్ణి యువరాజు చేస్తానని మాట ఇచ్చావు. నన్ను వశపరచుకోవటానికి ఇచ్చిన మాటను మీరవద్దు," అన్నది.

దుష్యంతుడు అంతా ఎరిగి ఉండి కూడా, ఎరగనట్టు నటిస్తూ, "దుర్మార్గురాలా, అసలు నువ్వెవరు? నిన్ను నేనెరగను. అసందర్భాలు మాట్లాడక, వచ్చిన దారే వెళ్ళు," అన్నాడు.

శకుంతలకు దుఃఖంతోబాటు కోపం కూడా వచ్చింది. ఆమె దుష్యంతుడితో, "రాజా, నీకేమీ తెలియదంటావా? ఇతరు లెరగరుగదా అని అబద్ధ మాడతావా? జరిగినదానికి నువే సాక్షివి. నీ అంతరాత్మ సాక్షి. నిజాన్ని కప్పిపుచ్చటం మహా పాతకం. ఏ సద్బుద్ధితో ఆనాడు నన్ను నీదాన్ని చేసుకున్నావో, ఆ సద్బుద్ధితోనే ఇవాళ నన్ను ఏలుకో. పశుపక్ష్యాదులు కూడా తమ సంతానాన్ని ప్రేమిస్తాయి. వీడు నీ కొడుకు. కన్న కొడుకును కాదనకు," అన్నది.

అప్పటికీ దుష్యంతుడి వైఖరిలో మార్పులేదు.

ఆ సమయంలో ఆకాశం నుండి అశరీర వాణి ఇలా అన్నది: "రాజా, ఈ పిల్లవాడు నీకు శకుంతల యందు పుట్టినవాడు. ఈ కొడుకును ప్రేమతో భరించు. వాడు భరతుడని పేరు పొందుతాడు."

దుష్యంతుడి భయం తీరిపోయింది. శకుంతల తన భార్యేననీ, ఆమె కుమారుడు తన కుమారుడేననీ లోకానికి వెల్లడయింది. అందుచేత అతను ధైర్యంగా వారిని చేరదీశాడు.





# గాంధీ కథ

## 3

మోహన్ శాకాహారవ్రతం అవలంబించటం అతనికి ఒక మేలు చేసింది. "వెజిటేరియన్" అనే పత్రికకు అతను తొమ్మిది వ్యాసాలు రాశాడు. అందులో హిందువుల ఆహారనియమాలూ, ఆచారాలూ, పండుగలూ గురించి వివరిస్తూ, కొంత హాస్యం కూడా మిళితం చేశాడు. లండనులోని శాకాహార క్లబ్బులో కార్యవర్గ సభ్యుడై, తాను నివసించే ప్రాంతంలో ఒక శాకాహార క్లబ్బు కూడా స్థాపించాడు.

తాను ఇంగ్లండులో గడిపిన మూడేళ్ళలో బయటి ప్రపంచంతో ఎక్కువ సంబంధాలు పెట్టుకోలేదు. శాకాహార క్లబ్బుగాక అతన్ని ఆకర్షించిన మరొక సంస్థ "అంజుమాన్ ఇస్లామియా". ఇందులో అధికంగా భారతీయ ముస్లిము విద్యార్థులుండి అల్పాహారవిందులు ఏర్పాటుచేసుకుని, ఆ సందర్భంలో రాజకీయ, సాంఘిక సమస్యలు చర్చించేవారు. ఈ చర్చలలో ముస్లిమేతరులు కూడా పాల్గొనవచ్చు. కాలక్రమాన ప్రముఖులైన భారతీయులలో కొందరు ఈ చర్చలలో పాల్గొన్నారు. వారిలో గాంధీతోబాటు అబ్దుర్రహీమ్, మజ్హరుల్ హక్, ముహమ్మద్ షఫీ, సచ్చిదానంద సిన్హా, హర్‌కిషన్‌లాల్ గౌబా ఉండేవారు. గాంధీ చాలా తక్కువ మాట్లాడేవాడు. మిగిలినవారిలాగా బల్లగుద్ది చెప్పటం అతనికి చాతనయేదికాదు.

అతను అక్కడ ఉన్న రోజులలో మార్క్స్, డార్విన్‌ల భావాలు రాజకీయ, వైజ్ఞానిక, సాహిత్యరంగాలలో ఎంతో సంచలనం కలిగించాయి. కాని మోహన్‌పై ఆ సంచలనం ప్రభావం ఏమీ లేదు. అతను భగవద్గీతా, బైబిలూ తరుచు చదివే



వాడు. "నేను ఇంగ్లండులో ఉన్న మూడేళ్ళలో చెయ్యనివి చాలా ఉన్నాయి.... ఈ కాలంలో నేను మాంసమూ, మద్యమూ ముట్టనందుకు తృప్తిపడుతున్నాను," అని అతను 1891 జూను 20 "వెజెటేరియన్" పత్రికలో రాశాడు.

అతను ఇంగ్లండులో ఉండగానే అతని తల్లి మరణించింది. అయితే ఆ సంగతి అతనికి రాయలేదు. దేశానికి తిరిగివచ్చాకనే అతనికి తల్లి మరణవార్త తెలిసింది. మోహన్ కుంగిపోయాడు. ఆమె అతని జీవితానికి చుక్కానివంటిది. అతను "మహాత్ముడు" అని ప్రపంచం చేత



గుర్తించబడటానికి ముఖ్యకారణం ఆమె ప్రభావమే.

బారిస్టరయి తిరిగివచ్చిన మోహన్ రెండు చేతులా సంపాదిస్తాడని అతని అన్న ఆశించాడు, కాని అలాటిదేమీ జరగలేదు. ప్రాక్టీసు చెయ్యటానికి అవసరమైన హిందూ, ముస్లిము న్యాయచట్టాలను రెంటిని గురించీ అతని 'కేమీ' తెలియదు. రాజకోటలోని చచ్చువకీళ్ళు కూడా అతని కన్న ఈ విషయంలో మేలే. మోహన్ శ్రద్ధగా కొత్త పుస్తకాలు పఠించాడు. "ప్రైవేట్లు" కేసులు తెస్తేనేగాని కొత్త ప్లీడరుకు ప్రాక్టీసు పెరగదు. అయితే మోహను తత్వానికది చాలా హేయంగా కనబడింది.

అతను పట్టిన మొదటి కేసు మామిబాయి అనే పేదరాలిది. ఫీజు కింద అతను 30 రూపాయలు పుచ్చుకున్నాడు. తీరా ఒక సాక్షిని క్రాసు పరీక్ష చెయ్యవలిసి వచ్చేసరికి అతని బుర్ర పని చెయ్యలేదు; కుర్చీలో కూలబడిపోయాడు. తరవాత అతను తన క్లయింటుకు ఫీజు డబ్బు తిరిగి ఇచ్చేశాడు. ఇలా ఆరంభమైన వృత్తి అతని కెలాటి సంకటమయిందో మనం ఊహించవచ్చు.

బొంబాయిలో ఒక హైస్కూలులో నెలకు 70 రూపాయల జీతంగల ఖాళీ ఒకటి



ఉంటే మోహన్ దరఖాస్తు పెట్టాడు. కాని స్కూలువాళ్ళకు కావలిసినది డిగ్రీ. తనకు దరఖాస్తులు రాసే నేర్పున్నదని గ్రహించి, ఆ వృత్తి చేపట్ట నిశ్చయించాడతను. రాజకోటలో కూర్చుని దరఖాస్తులు రాసి పెడుతూ నెలకు 300 రూపాయలు ఆర్జించగలిగాడు.

అయితే ఈ వృత్తిలో కూడా అతనికి అవమానమే ఎదురయింది. మోహన్ ఒకసారి తన అన్న పరంగా బ్రిటిషు ఏజెంటుతో ఏదో చెప్పటానికి వెళ్ళాడు. ఆ అధికారి అతన్ని తన ఇంటి నుంచి బయటికి నడవమన్నాడు. మోహన్‌ను అధికారి అవమానించటమేగాక, అతనంటే దురభిప్రాయం కూడా ఏర్పరుచుకున్నాడు. పిటిషను దరఖాస్తులు రాస్తూ బతకాలంటే మోహన్ ఆ అధికారిని తరుచు కలుసుకోవాలి. బ్రిటిషుఅధికారుల ఆదరాన్ని సంపాదించలేనివాడు తన వృత్తి సాగించుకోవటం సాధ్యం కాదు.

ఈ పరిస్థితిలో అతనికి దక్షిణాఫ్రికా నుంచి ఆహ్వానం వచ్చింది. 40 వేల పౌనుల మొత్తం గురించి వ్యాజ్యం జరుగుతున్నది. మోహన్‌కు రానూ పోనూ ఫస్ట్ క్లాసు ప్రయాణ సౌకర్యమిచ్చి, ఖర్చులన్నీ భరించి, నూటఅయిదు పౌనులిస్తారు. తాను వకీలుగా పని చేయాలో, గుమాస్తాగా



పని చెయ్యాలో మోహనుకు తెలీదు. అతను ఏ వివరాలూ అడగకుండానే, వెళ్ళటానికి సమ్మతించాడు.

ఈసారి తాను చేసే దేశాంతరయానంతో తాను ఎలా రాటు తేలేదీ, ఎంతగా తాను ప్రజల మనిషి అయేదీ మోహన్‌కు తెలీదు. అదే విధంగా, అతన్ని తన ఇంటి నుంచి గెంటించిన బ్రిటిషు అధికారికి, తాను బ్రిటిషు సామ్రాజ్యానికి ఎంత నష్టం తెచ్చి పెట్టి నదీ తెలీదు.

1893 మే నెలలో మోహన్ డర్బాన్ చేరాడు. అతనిని పిలిపించిన అబ్దుల్లా అనే వాడు నేటాల్‌లోని భారతీయులలో ఒకడు. మోహన్ ధరించిన పాశ్చాత్య దుస్తులూ, నాగరిక భాషణా, అతని కొద్దిపాటి వయసూ చూసి, ఇతను చూస్తే ప్రతి పక్షులకు అమ్ముడు పోయేలాగున్నాడనుకున్నాడు అబ్దుల్లా. కేసు నడుస్తున్నది ప్రిటోరియాలో. ఈ యువక బారిస్టరు అక్కడికి చేరేలోగా రెండో పక్షంవాళ్ళు ఇతన్ని "చెడగొట్ట" వచ్చు. అయితే అబ్దుల్లాకు ఈ భయం త్వరలోనే తీరిపోయింది. తనలాగే ఈ యువకుడికి కూడా మతబుద్ధి హెచ్చు.

మోహన్ ప్రిటోరియాకు బయలుదేరే ముందు ఒక్క వారం రోజులే డర్బాన్‌లో ఉన్నాడు. ఈ వారం లోపలనే అక్కడ ఉండే వర్ణవిద్వేషం అతనికి అర్థమయింది. అతను అబ్దుల్లా వెంట డర్బాన్ కోర్టుకు వెళ్ళాడు. మేజిస్ట్రేటు తెల్లవాడు. మోహన్‌ను తలపాగా తీయమన్నాడు. మోహన్ నిరాకరించి, కోర్టు నుంచి వచ్చేసి, స్థానిక పత్రికకు ఒక ఉత్తరం రాశాడు. ఆ పత్రిక అతన్ని "బొట్టూ కాటుక పెట్టి పిలవని అతిథి" అని విమర్శించింది. ఇలాటి వర్ణవిద్వేషం అతనికి లోగడ అనుభవం కాలేదు. భారతదేశంలో బ్రిటిషువారి అహంకారం వ్యక్తిత్వానికి చెందినదనుకున్నాడు. ఇంగ్లండులో ఇంగ్లీషు వారు చాలా మర్యాదస్థులు.



# 90. "నీలి" పాఠశాల

టర్కీలోని సివాస్‌నగరాన్ని 1400 లో తామర్‌లేన్ పట్టుకున్నప్పుడు, నగరపు అగడ్తలలో 4000 మంది అర్మీనియా అశ్వికులను సజీవంగా పూడ్చిపెట్టాడట. కాని ఆయన ఈ అందమైన పాఠశాలను నిర్మూలించకుండా వదిలిపెట్టాడు. దీని పైన కొరాను నుంచి ఉల్లేఖనలు రచించి ఉన్నాయి.



Photo by M. A. Mohan Rao



బహుమతి
పొందిన వ్యాఖ్య

నొసటి గీత

పంపినవారు :
జి. కె. రావు, విజయవాడ.

Photo by K. S. Vijayaker



బహుమతి
పొందిన వ్యాఖ్య

నెత్తిన మోత

పంపినవారు:
జి. కె. రావు, విజయవాడ.

× √

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1969 జులై నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ మే నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : నొసటి గీత

రెండవ ఫోటో : నెత్తిన మోత

పంపినవారు : ఘంటా కోటేశ్వరరావు,

శ్రీనగర్, విజయవాడ—3.

బహుమతి మొత్తం రు. 20/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'


వస్తోంది!
రవిచిత్ర ఫిలిమ్స్
టక్కరి దొంగ
చక్కని చుక్క
నిర్మాత: వై.వి.రావ్ దర్శకత్వం: కె.యస్.ఆర్.దాస్
మాటలు
మహారథి
ఫొటోగ్రఫీ
S.S.లాల్
సంగీతం
సత్యం
పూర్ణా రిలీజ్

# నేను నా క్లాసులో మొదటి వ్యక్తిగా ఉత్తీర్ణు రాలనయ్యాను...

పరీక్షలు దగ్గరకి వస్తున్నాయి. ఇంక పరీక్షల కోసం బాగా చదవాలి. వేడిగా వుండే రోజులు కూడా సమీపిస్తున్నాయి. ముఖ్యంగా మధ్యాహ్నము సమయంలో చాలా వేడిగా వుంది. ప్రతి వ్యక్తి కష్టపడి చదవాలి. పగలు వేడి వల్ల ప్రతి వ్యక్తికి అలసట వస్తుంది. గొంతుక ఆర్చుకు పోతుంది. అల్లాంటప్పుడు కుల్ టెబ్ నన్ను కాపాడింది. ఒకే ఒక టేబ్లెట్ తో రుచికరమైన పానీయము తయారైంది. నేను దానిని త్రాగిన తరువాత ఎంత హాయిగా వుంది! దాని తరువాత ఎంత ఉత్సాహముతో చదివాను! నా పరీక్షలో నేను మొదటి వ్యక్తిగా ఉత్తీర్ణు రాలనయ్యాను అంటే ఆశ్చర్యము లేదు...["ప్రమీల

ఒక కుల్ టెబ్ టేబ్లెట్ ఖరీదు 10 పైసలకు లోపు మాత్రమే.

అది ఎప్పుడైనా, ఎక్కడైనా హాయిని గొలిపే పానీయము



**కెమొ-ఫార్మ లేబరేటరీస్ లిమిటెడ్**

పి.బి.215.వర్లి, బొంబాయి 15.

CP-8491

## సుఖ మెరుగని రాజకుమార్తె

సూర్యరాజు సామ్రాజ్యంలో విచారం ప్రబలింది ... అందాల రాకుమార్తెకి ఎప్పుడూ ఆనందంలేదు

రాజు మంత్రుల ఉపదేశం కోరతాడు కానిలాభం లేకపోయింది ...



అమూల్య మైన కానుకలూ ఆనందాన్ని కల్గించలేదామెకు...



రాజ్యంలో విచారం సుస్థిర మైపోయింది.



ఓనాడో అందమైన రాజకుమారుడు గుర్రం దిగే దిగటంతో సుఖమెరుగని రాజకుమార్తెను చూస్తాడు



కోటలోపల ...







రాజ్యంలో సంతోషం తిరిగ తాండవిస్తూంది ...




BB 4747

STUDIO Ketna

వస్తోంది!

నాగావళీ (విజేతా) ఫిలింస్
సమర్పించు

# జరిగిన కథ



కథ- దర్శకత్వం:
కె. బాబూరావు

నిర్మాత:
కె. ఎ. ప్రభాకర్

డిస్ట్రిబ్యూటర్స్: ఆంధ్ర: జోతీ సీడెడ్: నవభారత్ నైజాం: దివ్యదత్తా JOTHEE

